వేమన గ్రంథమండలి తృతీయపుష్పము

# అసంగానంద గౌతమబుద్ధులు



రచయిత:

ఆరుమళ్ల సుబ్బారెడ్డి

కం॥ పలికెడిది గురునిచరితము
పలికించెడివాఁడు గురుఁడు, ధనమునఁగింపన్
పలికెద సద్గురుచరితము
పలువిధముల వ్యర్థకథలు పలుకఁగనేలా ?

దువ్వగ్రామ నివాసురాలగు

శ్రీ వెన్నమని సీతమ్మగారి

ధనసహాయమున

ఈ గ్రంథము ముద్రించడమైనది.

# పీఠిక

రాహుల సాంకృత్యాయనుడు బౌద్ధమతము నేడువ్యాప్తిలో నున్న సమస్తదేశములు తిరిగి అప్పటి బౌద్ధపీఠములను దర్శించి, అందలి బౌద్ధమతగ్రంథముల నన్నిటిని శోధించి బుద్ధచర్య అను ఉద్గ్రంథమును రచించిరి. సాంకృత్యాయనుడు ముప్పదికి మించిన భాషలలో నారితేరిన పండితుడు. బహుళ గ్రంథకర్త. ఆ బుద్ధచర్యను మాస్వాములవారు తెనుగు చేయించి ప్రకటించినారు. ఆగ్రంథము రాజమహేంద్ర పురములో చాతుర్మాస్య వ్రతోత్సవము సందర్భములో స్వాముల వారి సమక్షమున మహాసభలో నేను జదువుట తటస్థించెను. అదిచదువుచుండినపుడు బుద్ధుని ప్రతిచర్యయు సద్గురు మళయాళ స్వాముల చర్యలకు సరిపోవుచుండెను. గ్రంథము సమగ్రమగునప్పటికి మా మళయాళస్వాములు బుద్ధుని అపరావతార మని నేనెన్నడో అనుకొన్నది యథార్థమనియు ఆయిరువురకుగల సారూప్యసాదృశ్యములను భక్తబృందము నెదుటపెట్టుట అవసరమనియు తలంపుగలిగి వెనువెంటనే ఈ చిన్నగ్రంథమును రచించితిని. శ్రీ సాధుమాతగారి ఆశీస్సులు లభ్యమగుటవలన వెంటనే గ్రంథము ముద్రణ భాగ్య మందినది.

శ్రీ సద్గురు మళయాళ స్వాములవారిని గురించి ఈ పీఠికలో గొంచెము వ్రాసి స్థూలముగ శ్రీవారిని మీకు గ్రంథ

పతనమునకు ముందు ఎరుకపఱచు కొందురు. శ్రీ శంకరా చార్యులవారు జ్ఞానికి పాపపుణ్యములులేవు అని చెప్పినా రనియు, పరమార్థతత్త్వమును తెలిసికొనినచో ఈలోక వ్యవహారములో నెటుల ప్రవర్తించినను మోక్షమునకు ప్రతి బంధకము కాదనియు కొందరుచెప్పెదరు. శ్రీ సద్గురు మల యాళ స్వాములవారు నిజమగు జ్ఞాని లోకవ్యవహారము నందుగూడ సనాతన మత విరుద్ధముగ లోకశ్రేయస్సునకు భంగకరముగ నెన్నడు ప్రవర్తింపడనియు, సనాతనమత ములో నెచ్చటను జన్మచేతను కులములేర్పడె ననునది లేద నియు గుణకర్మలచేతనే వర్ణములేర్పడెననియు గుణము అర్హత ననుసరించి, సర్వవిషయములలోను సర్వులకును హక్కునిచ్చుగల మతమే సన్మతమనియు, అట్లుకానిమతము లన్నియు దుర్మతములనియు శ్రీవారి సిద్ధాంతము- గుణముల ననుసరించి సర్వస్థానములలోను అర్హతగలుగజేయని మతము అచిరకాలములోనే ఛిన్నాభిన్నమైపోవునని వారి అభి ప్రాయము. సనాతన మన సదా యెట్టిమార్పులను పొందక యేకరూపముగనుండు సద్వస్తువనియు, దానిని పొందుటకు శమదమాది సద్గుణములుగల మానవమాత్రు లెల్ల రర్హు లనియు శ్రీవారి సిద్ధాంతము.

భక్తిపరులు కొందఱు అన్నిటికి సర్వేశ్వరుడే గలడని నిర్లిప్తులై పురుషకారమును లక్ష్యముచేయరు. అట్టివారికి

శ్రీ స్వాములవారు పురుషకారముయొక్క ఆవశ్యకతను గట్టిగా నుద్బోధించెదరు.

భౌతికవాదులు లేక పరిణామవాదులు సృష్టి అణు సంయోగము లేక రాసాయినిక మార్పులవలన నేర్పడునను భౌతిక సిద్ధాంతమును గమనించియు, కర్మసిద్ధాంతమును బురస్కరించుకొని మానవులు భోగలాలసులు నిర్దయ హృదయులు గాగూడదనియు, అట్లగుదురేని కర్మఫలితము లగు జన్మపరంపరలనుండి తప్పుకొన నేరరనియు స్వాముల వారు చెప్పెదరు.

భక్తి, కర్మ, ధ్యాన, జ్ఞాన యోగములు అవినాభావ సంబంధముగలిగి. పరస్పర సహాయకములనియు. కర్మ చేయకున్న లోకవ్యవహారము నడుపదనియు, భక్తి ధ్యాన యోగములు జ్ఞానయోగమునకు రాచబాటయనియు, ఆత్మ సాక్షాత్కారమునొందిన జ్ఞానయోగికూడ, భక్తిధ్యాన యోగ ముల నెన్నడు విడువరాదనియు చెప్పెదరు.

ఆశ్రమములో వ్యవసాయము గోపోషణ, సూత్ర యజ్ఞము, సంస్కృతపాఠశాల, అతిథిఅభ్యాగతుల కేర్పరచిన అన్నసత్రము, వారికర్మయోగమునకు ప్రబలతార్కాణము. వారు ఆత్మసాక్షాత్కారము నొందియు నియమము తప్పక భక్తి, ధ్యాన యోగములను నేటికిని అనుష్ఠించుచున్నారు.

గృహస్థులు తమ ఆశ్రమధర్మము నిర్వహింపుకొనుచు అనుష్ఠానపరులైనచో సన్న్యాసి పొందెడు స్థానమునే పొందగలరనియే శ్రీవారి సిద్ధాంతము —

శ్రీ స్వాములవారు సాధకులకు సన్న్యాసులకు ఆదర్శమూర్తులు. గృహస్థులకు, సనాతన మత ప్రబోధకులు. శ్రీ అసంగానందుల త్యాగము, దీక్ష, సేవాతత్పరత, నియమపాలన. ఏ విషయము చూచినను ఆ బుద్ధావతారమే: — ఇప్పటికే దీర్ఘమైనది. ఇంతటితో విరమించెదను.

విధేయుడు

గ్రంథకర్త

---

శ్రీ



ఓమ్

# అసంగానంద గౌతమబుద్ధులు

"సకలమతవర్తి యతిలోకచక్రవర్తి బుద్ధసమమూర్తి మలయాళసిద్ధమూర్తి" అను మకుటముగల పద్యగుచ్ఛ మొందురచించి 1943 ప్రాంతమున కాబోలు భక్తిపురస్సరముగా శ్రీ అసంగానందస్వాములకు సమర్పించుకొంటిని. (శ్రీఅసంగానంద యతీన్ద్రులు నే డెల్లెడలను మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వాములు. అని పిలువబడుచున్నారు)

బుద్ధసమమూర్తియను పదప్రయోగము, అతిశయోక్తి యని నామిత్రు లొకరిద్దఱానాడు నన్నధిక్షేపించి యుండిరి. నాటి నా విశ్వాసము సత్యమని యానాటికానాటికి ధ్రువపడి నేటికి నన్నీగ్రంథమునకు బురికొల్పినది. ఆ నాటి గౌతమబుద్ధునకును, ఈనాటి యసంగానందునకును, ఆహార విహార ధ్యానాద్యనుష్ఠాన ప్రబోధ పద్ధతులలో నించుకేని భేదము గానరాదు. యజ్ఞయాగాదులలోని పరమార్థమును మఱచి రక్తబలిదానమును, పరమపవిత్రకార్యముగ నెంచి సంఘమెల్లను హింసాప్రవృత్తికిలోనై యున్న స్థితిలో నవతరించి, అహింసాపరమధర్మమును ప్రబోధముచేసి, లోకమును పునీత మొనరించినవారు గౌతమబుద్ధుడు.

భారతవర్ష ప్రతిభావిఖ్యాతులకు మూలకారణములయిన ఋషివాణీరూప సనాతన సత్యసూక్తుల కపార్థములు కల్పింప బడినట్టియు, అవియు నెల్లఱకు నందుబాటులో లేకుండజేయ బడినట్టి స్థితిలో, నవతరించి, ఆ దుఃస్థితి కనుతాపము నొంది, జాతి మత కుల దేశభేదములు లేకుండ స్త్రీపురుష లెల్లఱకు ప్రజాభాషతో పరమతత్త్వమును అమృతగాన మొనర్చుచు నెల్లర సద్ధర్మపరాయణుల నొనరింప జూచు చున్నారు అసంగానంద యతీన్ద్రులు.

ఊరక కారణజన్ములు జన్మింపరనియు, దేశ కాల సంఘ పరిస్థితులు వారవతరించి సరిదిద్దవలసినంత దుస్థితిలో నుండి నపుడుమాత్రమే అటులజరుగుననియు, అందునను, వారే సంఘములో, నే ప్రదేశమున, నెప్పుడెటుల అవతరింప దగునో, అటులనే యవతరించెదరనియు, హిందువుల విశ్వాసము. “యథారాజా, తథాప్రజాః” అనువిశ్వాసము సంఘమునకు బలముగానున్నకాలములో శ్రీ గౌతమబుద్ధుడు రాచబిడ్డడై జన్మించినట్లు “యథాప్రజా స్తథారాజా” యను ఈ కాలమునకు సరిపోవునటుల గౌరవ సంప్రదాయ ములు గల సామాన్యకుటుంబములో శ్రీ అసంగానందులు జన్మించుటయు, యుద్ధవిజయములకు, స్వర్గభోగములకు యజ్ఞయాగాదిక్రతువులే ముఖ్యకారణములను విశ్వాసము

గల క్షత్రియసంఘము హెచ్చుగానున్నదశలో గౌతముడు క్షత్రియుడుగ జన్మించినట్లు, బ్రాహ్మణేతరులు వేదపఠన శ్రవణములకు నిషేధింపబడి ఉపనిషన్మతమును నెఱుంగక, పరమార్థతత్త్వము గ్రహింప నవకాశములేక పతితమైన స్థితిలో అసంగానందులు బ్రాహ్మణేతరుడుగ జన్మించుట కాకతాళీయము గాదనిన్నీ, అసంగానందులు గౌతమబుద్ధునివలె "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్'' అను గీతా వచనము ననుసరించి జన్మించిరనుట సత్యమనియు స్పష్టపడుచున్నది.

దాదాపు మూడువేల సంవత్సరముల వ్యత్యాసముగ జన్మించిన శ్రీ అసంగానంద గౌతమబుద్ధుల మధ్యకాలమున సమాజాభివృద్ధికై జీవితమెల్ల ధారవోసిన మహనీయు లనేకులు లేకపోలేదు. అందులో సర్వసంగపరిత్యాగులై నిష్కామముగ సేవజేసినవా రెందరుగలరనునది మనము చూడవలసి యున్నది. వారిలోగూడ ఆత్మసాక్షాత్కార పర్యన్త మేకాంతమున కఠోరతపస్సుచేసినత్యాగు లెందఱు గలరో, మరలనావిషయము విచారింపదగినది. అట్టివారిలో గూడ సర్వమతసామరస్యము, సర్వమానవ సౌభ్రాతృత్వ మును గలిగిన మహనీయు లెందఱుగలరోయని పరిశీలింప

వలసియున్నది. అందులోను తిరిగి జ్ఞానాభివృద్ధికి (బుద్ధత్వ ప్రాప్తికి) సంబంధించిన ప్రబోధములను, ధర్మాభివృద్ధికి సంబంధించిన దీర్ఘతరోపదేశములను, సంఘైకమత్యమునకు ప్రవర్ధకములగు మహాప్రవచనములను, సమానముగా ప్రచారముచేసిన సర్వజ్ఞు లెందరుగలరని విచారించినచో ప్రప్రథమున శ్రీగౌతమబుద్ధ అసంగానందులే గనుపించెద రనిన అతిశయోక్తి కానేరదు.

పరులను బంధవిముక్తులనుగ జేయదలంచినవాడు తన బంధములను మున్ముందు పటాపంచలుగా చేయవలయునను నార్యోక్తిని అతిబాల్యముననే గుర్తింపగలగిన మేధావులు వీరలు. మఱియు భవబంధములను నిశ్శేషముగా ఛేదించు టకై గృహపరిత్యాగము జేసిన మహాత్యాగధనులు.

గృహత్యాగమును గురించి కాలాంతరమున శ్రీబుద్ధ భగవానులేమి చెప్పుచున్నారో చూడుడు : "భోగములద్వారా నిత్యసుఖము లభ్యముకాదని నేనుప్రబుద్ధుడను కాకముందే గ్రహింపగలిగితిని. ఆ తరుణమున నేను కోడెవయస్సు వాడను. నిగనిగలాడెడు నల్లనివెంట్రుకలు తెగబారెడుండె డివి. అట్టి యౌవనారంభముననే కులమువారెల్ల గొల్లున వాపోవు చుండగా, నేను గృహ పరిత్యాగము జేసితిని"

(శ్రీబుద్ధ చర్య)

ఈయంశమున శ్రీ అసంగానందులేమి చెప్పుచున్నారో చూడుడు: "నేను బాల్యమాది నియమబద్ధుడనై ధ్యానాద్యనుష్ఠానములను తప్పక చేయుచుండెడివాడను. నేనొక యింటివాడనైనచో, చూచి ఆనందింప దలచిన నా మాతాపితరులు నా తీవ్రసాధానానుష్ఠానముల జూచి భయపడుచుండెడువారు. మాతృదేవి నా వివాహమునకై మఱింత తొందరపడజొచ్చినది. నే నీప్రమాదమునుండి తప్పించుకొనవలసి యుండినచో, వెంటనే గృహత్యాగము చేయవలసి యున్నదని నిశ్చయించితిని. నా యీవైరాగ్యమును పసిగట్టిన నాతల్లి నన్నెప్పుడునీడవలె వెంటాడుచునే యుండెను. వేయికన్నుల కనిపెట్టుకొని కాచుకొనియున్న మాతృదేవి నెట్లో కనుబ్రామి ఒకనాటిరాత్రి మూడవయామున నా ధ్యానగృహమునుండి బయటపడి విశాల ప్రపంచమున అడుగితిని"

శ్రీ అసంగానంద గౌతమబుద్ధుల చరిత్రము, సద్గురువుల నన్వేషించుటలోను, పలువిధములైన యోగసాధనలను సాధించుటలోను ; ఆ యా సాధనలద్వారా ఆత్మశాంతిని బొందజాలక, యేకాంతమున తీవ్రతపస్సుల చేయవలయునని నిశ్చయించుటలోను, ఒకేవిధముగా నడచినది.

ఈ విషయమున శ్రీ గౌతమబుద్ధు డేమి చెప్పెనో గాంచుడు: "నేను మొదట ఆలారకాలామగురువులద్వారా

కొన్ని యోగములను సాధించితిని. వాటితో శాంతిలభించని కారణముగా ఉద్దక రామపుత్రునిచెంత జేరితిని. వారిప్రబోధ ములవల్లగూడ శాంతిచేకూరని కారణముచే నేకాంతమున తపమొనరించి పరమనిర్వాణమును పొందవలయునని నిశ్చయించితిని. అందుకు తగిన ప్రదేశముకొరకై యనేక దేశముల పర్యటించితిని. కట్టకడకు మగధదేశములోని సేనానిగ్రామ ప్రాంతప్రదేశములు నాహృదయము నాకర్షించి నవి. నిర్వాణప్రాప్తికై అఙ్జలుసాచు నాప్రబలప్రయత్న మునకు ఆస్థలము సర్వోత్తమమైనదని తలపోసి అందొకచోట కూర్చుని తపస్సు జేయనిశ్చయించితిని."

(బుద్ధచర్య)

ఈసందర్భమున శ్రీఅసంగానందు లేమిచెప్పుచున్నారో వినుడు: "ఆవర్శములయిన, ఆశ్రమములతోను, మహ నీయులైన ముక్తపురుషులతోను, ప్రకృతిరమణీయములైన దివ్యస్థలములతోను, వివిధ యోగసాధనలతో గూడిన ముముక్షువులతోను, నిండియున్న భారతమాత నొక్కసారి కాలినడకతో బ్రదక్షిణము చేయవలయునని, సంకల్పించి దాదాపు మూడుసంవత్సరములలో యాత్ర పూర్తిజేసితిని. ఆ సమయమున నే వినిన మహనీయుల దివ్యప్రబోధములు గాని, అవలంబించిన యోగసాధనలుగాని నాకాత్మశాంతిని

గలిగింప జాలినవికావు. ఏకాంతమున తపస్సుచేసినగాని ఆత్మశాంతి లభించదని నిశ్చయించి అందుకనువైన స్థలము కొరకై అనేకప్రదేశముల పరిశీలించితిని.

అదేమిదైవనిర్ణయమో చెప్పజాలనుగాని దక్షిణప్రాంత ములో చిత్తూరుజిల్లాలోని, తిరుపతి వేంకటేశ్వరస్వాముల కొండపైగల పుణ్యగుహలలోని పాండవగుహ నన్నాకర్షిం చినది. వెంటనే నేనాగుహలోనుండి తపస్సుచేయుటకు నిశ్చయించి అందుప్రవేశించితిని."

శ్రీ గౌతమబుద్ధ అసంగానందులలో మొదటివారు ఆరు సంవత్సరములున్ను, రెండవవారు 12 సంవత్సరముల 5 మాసముల 13 మూడు రోజులున్ను. అఖండదీక్షతో తపస్సును గావించిరి.

తపమొనరించెడికాలములో వారి ఆహారనియమ మెంత కఠోరముగానుండెనో వారిమాటలద్వారానే వినవలయును.

శ్రీ గౌతమబుద్ధు లేమి చెప్పుచున్నారో చూడుడు! "మొట్టమొదట పుడిసెడుఅంబలినిత్రాగుచు కాలముగడిపితిని. కొన్నిరోజులు ఆహారమును బొత్తిగామానితిని. దానిచే రక్తమాంసములు క్షీణించి శరీరము కాంతిహీనమై, దుర్భర స్థితికివచ్చినది. ఇట్టిదుర్భరశరీరముతో పరమనిర్వాణమును సాధించుట అసాధ్యమని గ్రహించి. ఒక్కపూట భిక్షాన్న

మును తినుటకు నిశ్చయించితిని. అట్టికటికితిండిని యేనాడును తిని కని యెరుగని ఈ ఉపాధి భిక్షాన్నము తినుటకు సహింప లేక క్షోభించిపోయినది".

ఆ సమయములో నాలో నే నిట్లు బోధించుకొంటిని. సిద్ధార్థా! బెగ్గటిల్లకుము! జరిగిన సంగతుల జ్ఞప్తిజేసి కొనుము. సుఖభోగములతో, తులదూగునాడు సాధువులను జూచి "నేను కూడ యేనా డిట్టి భిక్షదీక్ష తీసికొనగలనని యువ్విళ్ళూరితివి గదా, ఇపు డిట్లగుటకు కారణ మేమి?" ఈ విధముగ ప్రబోధము జేసికొని, మనస్సును తేర్చికొని తగుమాత్రము భుజింపనేర్చుకొంటిని. (బుద్ధచర్య).

ఇందున శ్రీఅసంగానందు లేమిచెప్పుచున్నారో చూడుడు. వ్రతపస్సులో నిమగ్నుడనగు నేను భిక్షాన్నమునకై గృహ స్థులయిండ్లవెంట తిరుగుచుకాలమును వృథాచేయుట మంచిది కాదని తలంచితిని. అనేకులు బిచ్చగాండ్రు తిరుగాడు ఆ పుణ్యక్షేత్రములో, అయాచితముగ భిక్ష దొరకుట కష్ట మని నాకు తెలియకపోలేదు. యేపరమసత్యమును గ్రహిం చుటకై గృహత్యాగముజేసితినో, ఆ సత్యాన్వేషణకై ఆతుర పడుచున్న నా మనస్సు కీ భోజనసమస్య తృణప్రాయముగ తోచినది. గోగర్భతీర్థములో యాత్రికులు వదలిన పిండ ములలోని పచ్చిపిండిని తిని కొన్ని రోజులుంటిని. శ్రీ

వేంకటేశ్వరస్వామి నైవేద్యముల వండిన ఖాళీపాత్రలలోవి మెతుకులు ఏరుకొని తినుచు అనేక రోజులు తృప్తి పడితిని. ఇట్లనేక రోజులు గడచిన అనంతరము అప్పటి మహంతుగారి తమ్ముడగు లక్ష్మణదాస్ బావాజీగారు ఒక నాడు స్వయముగా తమతోపాటు మఠములో భిక్ష తీసికొనవలయునని యర్థించెను. వేళకు భిక్షకై వెళ్ళెడు ఆ పద్ధతి ధ్యానమునకు భంగము గలిగించిన కారణముగా ఆచ్చటకు పోవుట మానివేసితిని. వెంటనే బావాజీగారీ సంగతిని తెలిసికొని శ్రీవేంకటేశ్వరస్వాములవారి నైవేద్యమునుండి యన్నపుముద్ద నొకటి నేను తీసికొనుట కంగీకరింపజేసిరి. తా నా విధముగా నొనరించుటకు శ్రీవేంకటేశ్వరస్వాముల వారి యాజ్ఞయేయని బావాజీగారు చెప్పుచుండెడివారు. ఈ విధముగా పరమేశ్వరుని కరుణకు పాత్రుడనైతినను ఉత్సాహముతో నా సాధనానుష్ఠానములకు మరింతకాల ముపయోగించితిని" ఇంతటి యచంచలమైన దీక్షాపరులు కానిచో వారెట్లు మహనీయులు కాగలుగుదురు? కార్యదీక్షలో మహాత్ములెట్టి కఠిననియమములనుగూడ సుఖపరముగా జూడగలరనునది భారతీయు లెరుగనివిషయము కాదుగదా? తీవ్రతపస్సుద్వారా యాత్మశాంతి లభించని కారణముగా శ్రీగౌతమబుద్ధు డెట్టి భీషణప్రతిజ్ఞను జేయుచున్నాడో చూడుడు.

" నా యీ యెముకలును నరములును చర్మమును శిథిలములై పోవుగాక. పరమనిర్వాణమును పొందక నే నీ ఆసనమునుండి కాలుచేయిగూడ కదల్పకుందునుగాక. అని శపథముజేసి పిడుగులకయిన చలింపనిదీక్షతో నాసనముపై నుపవిష్టుడనైతిని." శ్రీఅసంగానందులుగూడ నిట్టి శపథము చేయుటలో వెనుకంజ వేయలేదు. వారి ప్రతిజ్ఞనుగూడ వారి మాటలలోనే వినిపించెదను.

" ఏ సనాతనస్మృతులపైఁ గల విశ్వాసముతో నేను గృహపరిత్యాగమును జేసితినో, ఏ బ్రహ్మానందామృతమును గ్రోలనాశించి యైహికభోగములను కాలదన్నితినో, యే నిగమస్వరూపుని దర్శించుటకై నిర్జనగిరిగహ్వరములలో ననేక వర్షముల గడపితినో, అట్టి యాత్మశాంతిని పొందలేని ఈ దేహమును ధరించుటకూడ సిగ్గుచేటని తలంచితిని. నేటికి మూడు దినములలోపల అట్టి యాత్మశాంతియే నాకు లభింపనిచో, ఈ యుపాధి నీ లోకమునకు జూపరాదని తీర్మానించితిని. ఈ విషయములో పరాజయమేర్పడినచో కనురెప్పపాటులో ప్రాణముల నపహరింపగలుగు మరణోపాయములనుగూడ నన్వేషించి యుంచితిని " పైవిధముగా భయంకరశపథములు జేసిన శ్రీగౌతమబుద్ధ అసంగానందులు పరాజయము పొందలేదు సరిగదా, తమ్ముదవలెనే సర్వ

మానవుల దుఃఖావరణములను నిర్మూలములనుగా జేయు దివ్యమార్గములనుగూడ కనుగొనగలిగినారు.

శ్రీగౌతమబుద్ధఅసంగానందులు ప్రబోధించుటకు బయలు దేరిన ప్రారంభకాలములోనే సమాజములోని బలమగు నట్టి రెండువర్గముల నెదుర్కొనవలసివచ్చినది. దీనిలో మఱి యొక విచిత్ర మేమనగా సన్న్యాసులయిన యీ ప్రవక్తలు సన్న్యాసులనే యెదుర్కొనవలసివచ్చినది. మఱియొక ప్రక్క వేద (జ్ఞాన) మార్గానుచరులయిన యీ మహా ప్రబోధకులు వేదమార్గానుయాయులనే ఢీకొనవలసివచ్చినది. ఇటులేల జరిగినదో వినుడు.

బుద్ధునికాలములో జైనసాధువులు శరీరమును కృశింప జేసి తీవ్రవేదనములపాలుజేయుటయే కర్మవిముక్తికి మార్గ మని చెప్పుచుండెడువారు. అది సరిగాదనియు, మానసిక శిక్షణయే మార్గమనియు నిరూపించుటకై వారిని ఎదు ర్కొనవలసివచ్చినది. మఱియొకప్రక్క హింసాదూషము లయిన యజ్ఞయాగాదుల జేయుచున్న కర్మఠులను ఎదు ర్కొనవలసివచ్చినది.

అట్లే శ్రీఅసంగానందులును బాహ్యావేషపరివర్తనము చేతనే ముక్తిలభించునని చెప్పు స్వేచ్ఛాచారులగు గంజాయి సాధుసంఘములను, మఱియొకప్రక్క స్త్రీలు, శూద్రులు

మున్నగువారు వేదమార్గదూరులని ప్రబోధించు పండితులను ఎదుర్కొనవలసివచ్చినది. వీరినేగాక రాజయోగులమని చెప్పుకొను మఱియొక వర్గమువారినిగూడ శ్రీఅసంగానంద గౌతమబుద్ధులు ఎదుర్కొనవలసివచ్చినది. నిజమున కాధ్యాత్మికవృక్షమునకు రాజయోగులమని చెప్పుకొనువారు వేరుపురుగులవంటివారు. ఇట్టివారు బుద్ధునికాలములోగూడ లేకపోలేదు. ఉదాహరణమున కీక్రింది విషయములను చదువుడు.

ఒకసారి బుద్ధదేవునికడకు పోతలియను వైశ్యుడు వేడుకగావచ్చి యెదురుగా నిలువబడగా, వానితో శ్రీగౌతమ బుద్ధు డిటులనెను.

గృహపతీ ! నిలబడియెద వేల ? ఇష్టమున్న నట గూర్చొనుము.

బుద్ధుఁడు గృహపతీయని తన్నుపిలుచుట, అతనికి కంటకమైనది. గృహస్థవైశ్యుడని బుద్ధుఁడు హేళనజేయు చున్నాఁడని యతనిహృదయ మాందోళనము జెందినది. బదులుపలుకలేదు. బుద్ధుడిట్లు ముమ్మారు సంబోధించెను.

"గౌతమా ! గృహపతీ, గృహపతీ, అని నన్నుసంబో ధించుట నీబోటివానికుచితముగాదు."

"గృహపతీ! నీ రూపురేఖలు నీ యాకారప్రకారములు నీవు గృహపతివని చెప్పక చెప్పుచున్నవి. ఇప్పట్లో నేనేమని పిలువగలను ?"

"గౌతమా! నా వేషభాషలతో నీకేమిపని! సేద్యమును వదలితిని. వాణిజ్యమును మానితిని. పనిపాటలకు స్వస్తి చెప్పితిని. ధనధాన్యములు, వస్తువాహనములు, కొడుకులకు అప్పగించితిని. తిని పడుట తప్ప నాకు ఇంటిలో పనిలేదు. ఇటుల వ్యవహారపరిత్యాగినైన నన్ను మీవంటివారు గృహపతి యనుట భావ్యమా ?

"గృహపతీ! వ్యవహారత్యాగమనిన నీవుచెప్పునట్టిదికాదు. పెద్దలటుల ననరు. వ్యవహారశాంతికొఱకు - అహింస, అస్తేయము. సత్యము, అపిశునవచనము, అనిర్లోభము, అనింద, అక్రోధము, అమానిత్వములు గలిగి సర్వసంగములను వదలి యేకాంతయుక్తమగు ఉపేక్షను భావించుటయే నిజమగు త్యాగము. (బుద్ధచర్య)

బుద్ధునికాలములోనే, రాజయోగులమను శుష్కవేదాంతు లెందరో, యున్నప్పుడు. ఈనాడింటివారొకరు ఉండిరన్నచో ఆశ్చర్యమేమున్నది? ఈ మనవర్తిదార్లను, లేక, పించన్ దార్లను రాజయోగులనుట, కేవలమన్యాయము.

శ్రీ అసంగానంద గౌతమబుద్ధుల దివ్యప్రచారమునకు మొదట మార్గమే కనుపించలేదు. అన్యవర్గములవారికి హక్కు లేదని నమ్మినపండితులు వీరిప్రబోధములను తిరస్కరించెదరు. శుష్కవేదాంతులు, వీరినియమములను పాటింపరు. సామాన్యప్రజానీకమునకు వీరిసత్యసిద్ధాన్తము లర్థములుగావు. ఇన్ని ఆటంకములుండుటచేతనే, శ్రీగౌతమబుద్ధుడు, ఒకప్పుడు తన శుశ్రూషచేసివెళ్ళిన పంచవర్గీయ భిక్షకులకు. మొట్ట మొదట ప్రబోధించి తద్ద్వారా ప్రచారముజేయుటకు నిశ్చయించెను.

శ్రీ అసంగానందులు గీర్వాణభాషలోనున్న వేదాంత సారస్వతమును, దేశభాషలోని కనువాదము చేయించి కరపత్రములద్వారా గ్రంథములద్వారా మాసపత్రికద్వారా ప్రచారము చేయుచు, సంస్కృతపాఠశాలను స్థాపించి జాతిమతవిచక్షణ లేకుండా విద్యార్థులను, సంస్కృతవిద్యలో నుత్తీర్ణులనుగా జేసి వారిద్వారా తనప్రచారమును వ్యాప్తముజేయ నిశ్చయించెను.

ప్రారంభములో వారెన్నియో ప్రాతికూల్యమార్గములను నెదుర్కొనిరి. వారి నిరంతరకార్యదీక్షా పరత్వముచేతను, నిష్కళంక అనుష్ఠానపటిమచేతను, శ్రీ గౌతమబుద్ధ అసంగానందుల మతము విశ్వవ్యాప్త మయినది. కానున్నది.

దేహాత్మబుద్ధి మొదలంట త్రుంచివైచిన మహనీయులకు తప్ప, సమాజములో వ్రేళ్ళుపాతుకొనిపోయిన అన్ధవిశ్వాసములను దొలగించుట సామాన్యమానవులకు సాధ్యపడునా? అసంగానంద గౌతమబుద్ధులు దేహాత్మబుద్ధి యను తమస్సును, పటాపంచలుసేసిన జ్ఞానస్వరూపులు. సుషుప్తిలోనయిన అజ్ఞానావరణమును దరిజేరనీయని జ్యోతిర్మయులు. అంతటి మహనీయులగుటచేతనే, జీవితమెల్ల నాత్మస్వరూపులై నెగడిరి. ఉదాహరణమున కీ క్రిందివిషయముల చూడుడు.

మట్టిపాత్రను చేత ధరించి భిక్షాటనము జేయుచున్న కుమారుని చూచి శుద్ధోదనమహారాజు దుఃఖతప్తుఁడై కుమారుని చేతిలోనిపాత్రను లాగివేయ నుంకించునప్పుడు, " మహారాజా ! నేను నీ వంశీయుడనుకాను. బాటసార్లకు ధర్మశాలలలోవలె నా కీ క్షత్రియవంశముతో తాత్కాలిక కృత్రిమసంబంధమేకాని, నిజమునకు నాకు బుద్ధవంశీయులే పూర్వపురుషులు. నా వంశమర్యాద ననుసరించి నా కీ భిక్షాటనమ్మే తగినదని అతిసహజముగా జవాబియ్యగలిగినాఁడు." శ్రీఅసంగానందులు దేహాత్మబుద్ధి లేనివారనుటకు వారు మలయాళస్వాములని పిలువబడుటయే నిదర్శనము. మలయాళభాష మాతృభాష యని తెలియవచ్చిన కారణ

ముచే ప్రజలట్లు పిలుచుటతప్ప, అది తల్లిదండ్రులు గాని, సంస్కారగురువులుగాని, పెట్టిన నామధేయము కాదుగదా ? నే నీ దేహమును కాను; నే నీ దేహమునే కానప్పుడు, ఈ యుపాధి కిడిన నామములు నే నెటులగుదును ? నే నీ రూపనామములకు సాక్షినగు సత్స్వరూపుండ నయినప్పుడు ఈ యుపాధిని ఎవ రెటుల పిలిచిన నేమి ?- యను దృఢ జ్ఞానముచే ప్రజలు పిలిచినటులే వ్యవహరింప గలుగుచున్నారు. ఇట్టి ఆరూఢజ్ఞానముతో జీవితమంతయు వ్యవహరింపగలిగిన సర్వసంగపరిత్యాగులు ప్రపంచ చరిత్రలో మన కెందఱు కనుపించెదరు ? త్యాగధనులు శ్రీఅసంగానందులు దేహసన్న్యాసమును తీసికొనకయే గురుపీఠము నధిష్ఠించిరి.

సన్న్యాససంప్రదాయము ననుసరించి దేహసన్న్యాసమును తీసికొననివారిని జగద్గురువులగు మండలేశ్వరులు సన్న్యాసినిగా నంగీకరించరు. ఆత్మసన్న్యాస మనస్సన్న్యాసములే ప్రధానములనియు, దేహసన్న్యాసము బాహ్యచిహ్నము మాత్రమే యనియు, శ్రీఅసంగానందుల విశ్వాసము. * ఆ విశ్వాసముతోనే శ్రీవారు పది సంవత్సర

* శ్లో॥ అంతస్సంగం బహిస్సంగం ఆత్మసంగం పరిత్యజేత్। సర్వసంగ నివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని. అని ప్రమాణము.

ములు వ్యవహరించిరి. అప్పటికే వారి ఆశ్రమము పెక్కు కట్టడములతోను, వందలాది సన్న్యాస శిష్యులతోను * వేలాది గృహస్థశిష్యులతోను, దినదినాభివృద్ధి చెందినది. వారి పాఠశాలలోని విద్యార్థు లనేకులు కళాశాల విద్య నభ్యసించుటకై కాశీ మొదలగు స్థలముల కేగిరి. వీరి సన్న్యాసశిష్యు లనేకులు ఉత్తరప్రాన్తములలోగూడ నివ సించుచుండిరి. దేహసన్న్యాసమును తీసికొనని శ్వేతవస్త్ర ధారిని గుడువని చెప్పిన కారణముగా, శ్రీఅసంగానంద సన్న్యాస శిష్యులకు మండలేశ్వరసంఘములో తగిన గౌర వము లభింపకుండెను. ఆ కారణముగా శ్రీవారిని కాషా యము తీసికొనవలసినదిగా పెక్కుమంది ముఖ్యులు బలవంతపెట్టసాగిరి. అంతమాత్రముననే శ్రీవారు అంగీక రించలేదు. వీరి సంస్కృతవిద్యార్థులకు మండలేశ్వరుల సహాయము లభింపకున్నచో, కాశీ మొదలగు స్థలములలో చదువుటకు తగిన వసతులు లభించుటలేదు. అట్టి అవ కాశము గలుగవలసియున్నచో తాను గూడ కాషాయము తీసికొని మండలేశ్వరుల దృష్టిలో సన్న్యాసిగా నంగీకరింప

---

* ఉత్తరప్రాన్తమందలి మండలేశ్వరులు కొన్ని పుణ్యదినములలో అడిగినవారికెల్ల సన్న్యాసము నొసగెదరు. అట్లిచ్చినవారు సంస్కారగురువు లని చెప్పబడెదరు. శ్రీవారి శిష్యులలోని కాషాయధారులలో ఇద్దరు ముగ్గురు తప్ప మిగిలినవారెల్ల అటుల తీసికొనినవారేయని తెలియవలెను.

బడవలసివచ్చినది. భారతీయుల దృష్టిలోనేగాక ప్రపంచ ప్రజ లెల్లరిచే గౌరవింపబడుచున్న కాషాయముయొక్క పవిత్రత యెట్టిదో, శ్రీవారికి తెలియనివిషయము కాదు. పవిత్రహృదయులగు శ్రీఅసంగానందులు కాషాయమును ఎంత పవిత్రముగా జూచెదువారో, తెలియగోరువారు కాషాయస్వీకారమునాడు గద్గదస్వరముతో వారన్న ఈ క్రిందిమాటలను చూడుడు.

పరిస్థితులను నిమిత్తముగా జేసికొని నాకు కాషాయ మును ప్రసాదింపనున్న ఓ సత్స్వరూపా ! నీ యిచ్ఛకు సదా బద్ధుఁడను. నిన్నింతవరకు, నే నేవిధమయిన భోగ భాగ్యములను కోరలేదు. కడకు ముక్తినిగూడ ప్రసాదింపు మని నిన్నర్థింపలేదు. ఇప్పట్టున నిన్నొకటి గోరుచున్నాను. ధరించినంతమాత్రముననే పూజనీయునిగ జేయగల మాహా త్మ్యము నీ కాషాయమునకే పూర్వఋషుల త్యాగబలిమిచే గలిగినదో, ఆదిశంకరులు మొదలు వివేకానంద, రామతీర్థ మున్నగు మహనీయులు ధరించిన కారణమున, ఏ కాషాయ మునకు, ఖండఖండాంతరములలో అఖండవిఖ్యాతి లభించి నదో అట్టి కాషాయమును ధరింపనున్న నా ద్వారా వేదాంత సంప్రదాయపు యశస్సు ఇనుమడింపబడునట్లు మాత్ర మనుగ్రహింపవలసినదిగా నర్థింపుచు, కంటినుండి ధారలు

ధారలుగా నశ్రువు రాలుచుండ వణకుచున్నకాయముతో కాషాయ మందుకొన్ననాటి అదృశ్యము ఆనాడు సమావేశములో పాల్గొనిన వందలాదిభక్తు లెఱిగినదే:

శ్రీఅసంగానంద గౌతమబుద్ధులు, ఆత్మసాక్షాత్కారము నొందియున్న ముక్తసంగులయినను, వారేనాడును, ధ్యానాద్యనుష్ఠానముల విడువకపోవుటలోనే వారి జీవిత మెంతటి ఆదర్శప్రాయ మైనదో స్పష్టపడుచున్నది. కాషాయము ధరించి స్వేచ్ఛాచారులై తిరుగుచు నియమములను పాటింపని వారిని; గురువుల పేరు జెప్పుకొని పొట్ట నింపుకొనువారిని, కామదృష్టితో స్త్రీలమధ్యలో సంచరించువారిని, శ్రీఅసంగానందగౌతమబుద్ధు లెంతతీవ్రముగా ఖండించెడువారో ఈ క్రిందిపంక్తులను చదువుడు. ఓ భిక్షువులారా! సన్న్యాసికి సత్యమార్గ మెందులకు దూరమైనది? కామలోభములు, ద్రోహమోహములు, కోపతాపములు, వాని చిత్తమును దయ్యాలకొంప జేసినవి. అగ్నిసమీపములోని ఆజ్యమువలె సన్న్యాసత్వ మతిప్రమాదముతో గూడినది.

బోడికొట్టినంతనే, కాషాయముకట్టినంతనే, జడలుపెంచినంతనే, నిర్జనస్థలమున నివసించినంతనే, భిక్షకదీక్ష తీసికొన్నంతనే, సన్న్యాసత్వము పూర్తికాదు. నిప్పును చెదలంటలేనటుల ఎవ్వనిచిత్తమును పాపవృత్తులు స్పృశింప

రేవో, బంగారమునకు చిలుములేనటుల, ఎవ్వనిశీలమందు మచ్చరేదో, ఎవ్వనియందు, మైత్రియు, కరుణయు, ముదితయు, ఉపేక్షయు, నను సువర్ణగుణములు నిండి యుండునో, వాడే సన్న్యాసియనదగినవాఁడు. సన్న్యాసిత్వము వానిని పొందియే సుమంగళియగును. వాడే నిర్వాణసౌధమునకు పునాదివేసినవాడు.

సన్న్యాసిధర్మమున కింతటి ప్రాముఖ్యత నిచ్చిన శ్రీ అసంగానంద గౌతమబుద్ధులు గృహస్థాశ్రమమును తక్కువగా చూడలేదు. ఒక గృహస్థాశ్రమమునేకాదు, చతురాశ్రమములలో దేనినిగాని, సర్వవర్ణములలో నెవరినిగాని, వారు తక్కువగా చూడలేదు. వారి సదుపదేశములయొక్క సారాంశ మీక్రింది విధముగా నుండును.

“ తీయని తేటనీరు గల కోనేటిలోనికి ఏవైపునుండి యెవరు దిగినను. వారివారి దాహవ్యథను శాంతింప జేసికొని సంతృప్తు లగునటుల, చతురాశ్రమములలో నున్న సర్వవర్ణములలోని, ప్రతివాడును పరమాత్మను పొందుట కర్హుడే ”

మనుచరిత్రలోని, “పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు. ” అను పద్యము మీ రెరుగనిదికాదు. అట్టి

గృహస్థుని ధర్మము లెవ్వియో, వివరించుచు, గృహస్థాశ్రమధర్మ మనుపేర, నొక ప్రమాణగ్రంథమును శ్రీ అసంగానంద యతీశ్వరులు రచించిరి. అందున గృహస్థులకు తగిన స్థానము నిచ్చిరి. ఒక సమావేశములో శ్వేత వస్త్రమును ధరించినవా రొకరు తమ మధ్య కూర్చున్నకారణమున కాషాయవస్త్రధారులకు కోపము వచ్చినదని తెలిసి రెండవనాటి సమావేశములో ప్రతియిద్దరి కాషాయవస్త్రధారులమధ్య ఒక్కొక్క శ్వేతవస్త్రధారిని కూర్చుండబెట్టి ఈ క్రిందివిధముగ ప్రబోధించిరి.

"మన సన్యాసులచే చేయబడుచున్న సమస్త పుణ్యకార్యములు, మహాసభలు గూడ గృహస్థుల సహాయము వలననే జరుగుచున్నవి. గృహస్థుడు అన్నవస్త్రముల నిచ్చుటచేతనే సన్యాసి దేహయాత్రను నిరపాయముగా జరుపుకొనగలుగుచున్నాడు. అట్లే సన్యాసి జ్ఞానామృతమును ప్రసాదించుటచేతనే, గృహస్థు ఆత్మశాంతిని పొందగలుగుచున్నాడు. ఈవిధముగా సన్యాసులు గృహస్థులు పరస్పరసహాయకులగుటచేత వారన్యోన్యము వియ్యంకుల వంటివారు. ఈసత్యము నేటిసన్యాసులు మరచినారు. నేనే పూజార్హుడనను వహం, నేటిసన్యాసి నావరించినది.

మనసంఘములో నట్టి అహమ్ము లేదని నిరూపించుటకే. నే నీదినమున కాషాయధారుల మధ్య శ్వేతవస్త్రములవారిని కూర్చుండబెట్టితిని. దీని కలవాటుపడినచో మేమాధిక్యత గలవారమను అహమ్ము మనలను విడిచిపోగలదు."

పై ప్రసంగమునుబట్టి గృహస్థునియందు వారికిగల సమత్వభావము వెల్లడియగుచున్నది.

కాషాయవస్త్రధారి నియమబద్ధుడు కానిచో, అతడప ఖ్యాతిని పొందినదేగాక, వేదాంతపరంపరకుగూడ, తలవం పుల దెచ్చినవాడగు ననుతలంపుతో, శ్రీ అసంగానందులు సన్న్యాస మిచ్చుట కనేకనిబంధనములను పెట్టెడివారు. కనీసము భగవద్గీత, పాతంజలయోగసూత్రము, కఠోపనిష త్తుల అర్థసహితముగాచదివి, కొన్నిసంవత్సరములు గురు కులవాసము జేసిననేకాని, కాషాయమివ్వనని నిర్ణయించు కొనిరి. తమవేలాదిమంది శిష్యులలో నిప్పటికి వారిస్వహస్త ములతో ఇద్దఱు ముగ్గురికి మాత్రమే సన్న్యాసమిచ్చినా రనినచో, కాషాయమును వారెంత పూజ్యభావముతో నారా ధింపుచున్నారో, ఆలోచింపుడు.

ఒకరిద్దఱి శిష్యులతో ప్రారంభింపబడిన శ్రీఅసంగానంద గౌతమబుద్ధుల దివ్యప్రబోధములు అచిరకాలములోనే, వారి కంటియెదుటనే, రాష్ట్రరాష్ట్రేతరప్రజలలోగూడ వ్యాపించుటకు

వారినియమబద్ధమైన ఆచరణయే ముఖ్యకారణము. నడచు నప్పుడుగాని, కూర్చున్నప్పుడుగాని, బోధించునప్పుడుగాని, నిద్రించునప్పుడుగాని, అంతరేంద్రియములతోపాటు బాహ్యేంద్రియముల సహితము నియమబద్ధములుగా నుంచుటలో ప్రాలుమాలి ఎఱుంగరు. వారిమతవ్యాప్తికై వారిశిష్యులు ఎంతటిత్యాగములకైనను సంసిద్ధులగుట వారి తపఃఫలము.

శ్రీ గౌతమబుద్ధునికాలములో కొందరు మేధావు లొకచో సమావేశమైనప్పుడు. నాటి యాధ్యాత్మిక ప్రపంచమున గురుస్థానమునలంకరించినవారిలో శిష్యులమన్ననలనందినవా రెవరను ప్రశ్నరాగా, నాటిగురువులలో శిష్యుల హృదయమును చూరకొన్నవాడు శ్రీ గౌతమబుద్ధుఁడొకడే యనియు, అతడు, ధర్మోపదేశముల జేయునప్పుడు సభలో నెవ్వరు కిక్కురుమనరాదనియు, ఎవరైన తుమ్మినను, దగ్గినను, వెంటనే చుట్టునున్నవారు ప్రేమ్మచూపియు, చేసైగలు చేసియు, మోకాళ్ళతో పొడిచియు వానిని పదిలముచేయువారనియు, వారివలె శిష్యులను అదుపులో పెట్టగలిగినవారుగాని, సభలను నిశ్శబ్దముగా జరిపింపగలిగినవారుగాని, నాటిగురువులలో మఱియొకరు కనిపించరేమనియు, వా రేకగ్రీవముగా తీర్మానించిరి'' (బుద్ధచర్య)

శ్రీఅసంగానందులసభలు మున్మూర్తులనట్లేయుండునని ప్రజలెల్ల రెఱింగినదే. వారినియమబద్ధమైన ఆచరణయే, వారి వైరాగ్యసహితత్యాగమే, వారికంతటిశక్తిని గలిగించిన వన్న అతిశయోక్తి కానేరదు.

ఎంతటి త్యాగవైరాగ్యములు లేకున్న, రారాజులు, శిష్యులయి యుండియు, శ్రీగౌతమబుద్ధుడు భిక్షాన్నముతో జీవితము గడపగలిగినాడు!

ఇక శ్రీ అసంగానందుల త్యాగవైరాగ్యముల చూడుడు. ఇన్ద్రనగరమునుబోలు నాశ్రమమున కధిపతియయిననేమి? తానుండునది మాత్రము పర్ణకుటీరము. సర్వభోగ్యవస్తువుళను సంకల్పమాత్రమునసమర్పింపగల వందలాది శ్రీమంతులు శిష్యులై యుండియు ఒకనాడును. ఎట్టిసౌఖ్యమునకును తావొసంగరు. ఆశ్రమములోనున్నప్పుడు, ఒట్టిచాపనే పాన్పుగా గలిగియుండిరి. (ఇతర రావులమాత్రము బల్లినుపయోగింతురు) ఇన్నిమాటలేల? వీపుపై వ్రణములేచి, అహర్నిశలు నిద్రాహారములు లేక శరీరబాధ అమితమయిన సమయమున సహితము. భక్తు లెన్నివిధముల బలవంతపెట్టినను, ప్రక్కకొక మెత్తనుపయోగింప నిరాకరించిన నియమశాలి. తమసంఘములో చేరవచ్చినవారితో మీ పూర్వపురుషులనుగూడ వెనుకటివలెనే, గౌరవించ

వలయునని ఆదేశించుటలో శ్రీ అసంగానందుని వమత్వ భావము గనందగును. ఇట్టిదియే శ్రీగౌతమబుద్ధునిలో నున్న దనుట క్రింది యుదాహరణమును గనుడు: ఒకసారి సింహ సేనాపతి బుద్ధభగవానునిసమీపించి 'ప్రభూ! నన్ను సాంజలి శరణాగత యుపాసకునిగా ననుగ్రహింప వలసిన'దని అర్థిం పగా, శ్రీగౌతమబుద్ధు డిట్లనియెను.

"సింహా! నీవు ప్రతిష్ఠగల పురుషుఁడవు. కొంత యోచించి నిశ్చయించుకొనుము."

"బుద్ధభగవానుఁడా! నీమాటచేతనే నేనుమఱింత బద్ధాంజలుడ నగుచున్నాను. నన్ను శిష్యునిగ స్వీకరింపు డని నేనితరగురువులతో నింతమాత్రము చెప్పినట్లయిన, అంతలోనే వారు వైశాలినగరమును తూర్పుపడమరల నేకము జేసియుందురు, మీరో. 'యోచించి నిశ్చయించుకొను' మని చెప్పుచున్నారు. మీనీతి ఉదారమయినది. మిమ్ములనే శరణు జొచ్చుచున్నాను."

"సింహా! చిరకాలమునుండి నీవు, జైనసాధువులకు, ధర్మసత్రమువలె ఆశ్రయమై యుంటివి? ముందు ముందు గూడ ఎప్పటివలెనే వారి నాదరింపుచు, అన్నపానము లర్పించుచుండుము."

ఇట్టి యుదారాశయములుగల శ్రీ అసంగానంద గౌతమ బుద్ధులవంటి సద్గురువు లెందఱుమనకు చరిత్రలో కనుపించె దరు? వీరిహృదయము లెంతవిశాలము లయినవో, కార్య దీక్ష అంతకన్న విశాలమయినది. అదిపల్లెయనికాని, పట్టణ మనికాని, అచ్చట. గౌరవాదరణలుండుననిగాని, యుండవని గాని తలంపకయే, ఆహ్వానించినవా డన్నివిధముల తగిన వాడా అని ఆలోచింపకనే. పిలిచినదే తడవుగా బయలుదేరి వెళ్ళి నియమించినప్రకారము కార్యక్రమమును సహనముతో నెరవేర్చుకొని వచ్చుటయే, తమకర్తవ్యముగా భావించిన కార్యశూరులు. ఉదాహరణ క్రిందివిషయమును తిలకింపుడు.

"తన్నాహ్వానించిన భక్తుఁడు తిరిగి కనుపింపకపోయి నను తన కార్యక్రమము ననుసరించి వేలాది శిష్యులతోసహా ఏదినమునకాదినము ధాన్యమును భిక్షమెత్తి.వాటిని స్వయ ముగా దంపుకొని తినుచు, చాతుర్మాస్యమును పూర్తి చేసికొని ఆఖరుదినమున, మొదట పిలిచినవానియింటికివెళ్ళి భిక్షతీసికొని, బుద్ధభగవాను డతనినాశీర్వదించినటుల బుద్ధ చర్యలోగలదు" ఆహ్వానించినవారు కార్యము నిర్వహింప లేనిస్థితిలో సహనముతో కార్యక్రమమును, పూర్తిజేసికొని వెళ్ళిన ఘట్టములు శ్రీ అసంగానందుని చరిత్రలో ననేక ములుగలవు.

శ్రీ అసంగానంద గౌతమబుద్ధుల క్షమాగుణమెంతగా ప్రకాశించినదో. నిరూపింపదలచినచో, నదియే యొకమహా కావ్యమగును. తన్నుభిక్షకై బిలిచి, సూకరమర్దనమును * వడ్డించిన మహాపాపియగు చందునిక్షమించిన బుద్ధుఁడు సామాన్యపాపులను క్షమించుటలో నాశ్చర్య మేమున్నది? అట్లే శ్రీ అసంగానందులును, తమసంఘములోనే వ్యతిరేకభావముతో తమ్ము విడిపోయి దుష్ప్రచారము జేసిన వారిని, పతనముజెందినవారిని, ప్రేమతో చేరదీసి, చక్కని మార్గములోపెట్టిన సందర్భము లెన్నియోగలవు. అనేక రోజులు శుశ్రూషచేసిన భక్తు డొకడు అనుజ్ఞ పొందకనే స్వతంత్ర ప్రచారకుడుగా బయలుదేరి, క్రమక్రమముగా పతితుడై చివరకు గృహస్థుగామారి కడకు పశ్చాత్తాపపడి రాగా, శ్రీ అసంగానందులు ప్రేమతో నాదరించి, చిరునవ్వుతో ప్రక్కన నిలువబడి అతనికి ప్రాయశ్చిత్తము జేయించుటను నేనొకసారి శ్రీ వ్యాసాశ్రమమున స్వయముగా చూచితిని. చోరవృత్తితో జీవితము గడుపుచు కడకు విరక్తుడనై శ్రీ అసంగానందుల నాశ్రయింపగా భగవద్ధ్యానముతో మూడుసంవత్సరములు భిక్షమెత్తుకొనుచు

* సూకరమర్దన మనగా, పందిమాంసమని కొందఱును. ఒకవిధమయిన రసాయనమని కొందఱును, వ్యాఖ్యానించినారు.

తీర్థాటనము చేయవలసినదిగా ఆజ్ఞాపించెననియు, అందు చేతనే ఇటుల తిరుగుచుంటిననియు ఒక భిక్షువు నాతో 1940లో తాటిపర్తి(నెల్లూరుజిల్లా)లో స్వయముగా చెప్పెను. అంతదూరమేల ? 1936 లో ఉంగుటూరు (కృష్ణాజిల్లా) లో జరిగిన సనాతనసభలో వందలాది సమూహముతో స్వాముల నెదుర్కొని వ్యతిరేక ప్రదర్శనములతో నానాభీభత్సముజేసిన నేను 1940 నాటికి భృత్యానుభృత్యుడనుగా మారిపోవుటలోనే వారి క్షమాగుణములెంత పరాకాష్ఠనొంది నవో స్పష్టపడుచున్నది.

అన్నదానమో, మౌనవ్రతమో, మంత్రజపమో, తీర్థాటనమో ఆయా దోషములకు తగిన ప్రాయశ్చిత్తకర్మల జరిపించి, తిరిగి అట్టితప్పులను చేయకుండ చూచుటలోనే వారెంతటి శాస్త్రీయమైన పద్ధతులపై సంస్థను నడిపించెదరో స్పష్టమగుచున్నది.

శ్రీ అసంగానందగౌతమబుద్ధుల నియమబద్ధజీవితమున కొకప్రక్క అంజలిఘటింపుచునే, మఱొకప్రక్క వారి సర్వమత సమ్మతమైన సిద్ధాంతమును ప్రతిఘటించెడు పండితులనేకులు లేకపోలేదు. ప్రతిపక్షులుగా నిలబడి పరాజితులయిన పండితులుగూడ తక్కువలేరు. వీరు పరాజితులయిన పండితుల ప్రశంసలను సహిత మందుకొను వాదనైపుణ్యము,

శాస్త్రానుభవము, లోకానుభవము, గల మహనీయులు. వీరి వాదనైపుణ్యము దెలియగోరువా రీ క్రిందివిషయముల గమనింపుడు.

ఒకసారి అశ్వలాయనుఁడు పెక్కుమంది పండితులతో గూడి గౌతమబుద్ధునిసమీపించి ఇటులఅనెను. " గౌతమా ! బ్రాహ్మణు డెక్కువ జాతివా డనియు, బ్రహ్మముఖమున పుట్టినకారణముచే పరిశుద్ధుడనియు, మా పండితు లందరి యభిప్రాయమైయున్నది. దీనికి మీరేమందురు ?"

" అశ్వలాయనా, బ్రాహ్మణస్త్రీలుగూడ, ఋతుమతులై అన్యస్త్రీలవలెనే గర్భవతులై ప్రసవించుచున్నారు గదా ? ఇతరులవలె జన్మించిన బ్రాహ్మణు డెక్కువవాడని, మీరెటుల నిర్ణయింపగలరు ?"

" గౌతమా ! అదేమో నాకు తెలియదు. ఈ పండితు లందఱు బ్రాహ్మణుడే ఎక్కువవాడని అభిప్రాయ పడుచున్నారు.

" అశ్వలాయనా ! వారిమాట అటుండనిమ్ము. నా యీ ప్రశ్నలకు సమాధానమిమ్ము. ప్రాణహింస, చోరత్వాది పాతకములు చేసినవారందరును నరకమున కేగెదరా ! అబ్రాహ్మణులు మాత్రమే నరకార్హులా !"

"గౌతమా! దురాచారు డెవ్వడైనను నరకమున కేగును."

"అశ్వలాయనా! సత్యాహింస శమదమాదిగుణములు గలవారైనను, అబ్రాహ్మణుడు స్వర్గమున కేగజాలడను నియమమేమైన గలదా!"

"గౌతమా! అట్టిదేమియులేదు."

"అశ్వలాయనా! బ్రాహ్మణ గృహమునందుండు అగ్ని, కాంతితో ప్రకాశించుచు, చండాల గృహాగ్ని కాంతి హీనముగా ఉండునా!"

"గౌతమా! అగ్నియెందున్నను ప్రకాశవంతమే"

"అశ్వలాయనా! ఇద్దఱు స్నేహితులున్నారు. వారిలో నొకడు ఉపనీతుడై గురుకులమునందధ్యయనము చేయుచుండెను. మఱియొకడు ఉపనీతుడుకాలేదు. విద్యాగంధ శూన్యుడు. వీరిఱువురిలో నెవరికి ప్రథమ తాంబూల మొసంగవలయును?"

"గౌతమా! ఉపనీతుఁడును; విద్యావంతుడును నగువానికే ప్రథమ తాంబూల మీయవలెను"

"అశ్వలాయనా! మఱియొక యిద్దఱుమిత్రులున్నారనుకొనుము, అందొక డుపనీతుడును, విద్యావంతుడునునై యున్నాడు, కాని, అవినీతిపరుడు దురాచారపరుడునునై

ఉన్నాడు. మఱియొకడు ఉపనీతుడు కాలేదు. విద్యా హీనుడు. అయితే అతడు శీలవంతుడు నియమవంతుడు కల్యాణధర్ముడు. వీరిరువురిలో నెవరికి అగ్రతాంబూల మివ్వవలయును ?

" గౌతమా ! శీలవంతునికే ఈయవలయును "

" అశ్వలాయనా ! నేను చెప్పునదిగూడ నంతియేగదా !"

గౌతమబుద్ధుడీవిధముగా వాదింపవచ్చినవారితోనే, తన వాదము నంగీకరింప జేయగల ప్రజ్ఞావంతుడు. మఱియొకప్పు డీవిధముగనే, స్వర్ణదండుడనువాడు చాలమంది పండితులతో కలసివచ్చి శ్రీ గౌతమబుద్ధుని ఇట్లెదిర్చెను.

" ఓగౌతమా ! జననముచే కులీనుడయినవాడును, రూపసియు, మంత్రవేత్తయు, శీలవంతుడును, జ్ఞానియు నైన వాడే బ్రాహ్మణుడనబడునని మాయందఱి అభిప్రాయమై యున్నది. దీనికి మీరేమందురు ? "

" స్వర్ణదండా ! అందఱియభిప్రాయ మటుంచుము. నీవు మహాపండితుడవుగదా ! ఆలోచించి సమాధానము జెప్పుము. ఈ అయిదింటిలో నే యొకటి లోపించినను బ్రాహ్మణార్హతలేదా ? "

" గౌతమా ! రూపమనునంశము లోపించినను, బ్రాహ్మణార్హతగలదు. "

"స్వర్ణదండా ! ఈ నాలుగింటిలో ఏయొకటియు తోపించుటకు వీలులేదా !"

"గౌతమా ! మంత్రవేత్తకాకపోయినను, బ్రాహ్మణత్వమునకు హానిగలుగదు"

"స్వర్ణదండా ! మిగిలిన మూటిలో నే యొక్కడైన తగ్గవచ్చునా !"

"గౌతమా ! కులీనుడుకాకపోయినను, శీలవంతుడును జ్ఞానియునైన చాలును."

"స్వర్ణదండా ! నేనుగూడ నిదియేగదా చెప్పునది" స్వర్ణదండు డిట్లంగీకరించినందుకు. బ్రాహ్మణపండితులు రోషపూరితులై స్వర్ణదండుని తిరస్కరింపగా స్వర్ణదండు డిట్లనెను.

పండితులారా ! తొందరపడకుడు. ఇదిగో ఈసభలోనే యున్న నామేనల్లుడు బుద్ధుని తర్వాత అంతటి రూపవంతుడు, మంత్రద్రష్ట, శీలవంతుడు, జ్ఞాని, కులీనుడు, మఱియొకడీ సమావేశములో లేడుగదా ! అట్టి ఈతడు జూదరి, త్రాగుబోతు మృషావాది అయినచో, ఇతనిరూపమెందుకు ? కులీనత యేమిచేయును ? వేదమెందుకు ? దీనినిబట్టియే, నేను శీలమును, జ్ఞానమును, బ్రాహ్మణత్వము

నకు చాలునని యంటినని, తనతోడిపండితుల నిరుత్తరుల జేసెను.

ఈవిధముగా గౌతమబుద్ధుడు వాదింపవచ్చినవారిలోనే ఇరువర్గముల గల్పించి వారిచేతనే తన సిద్ధాన్తమును అంగీకరింపజేయు ప్రజ్ఞాశాలి. ఈవిధముగనే, మేము ఋషి గోత్రజులమని, వాదింపవచ్చినవారినిగూడ ఎట్లు నిరుత్తరు లను జేసెడివారో చూడుము.

"నాయనలారా! మేము వసిష్ఠయాజ్ఞవల్క్యగోత్రజుల మని చెప్పుకొన్నంతమాత్రమున మీరు ఋషులగుదురా! మీలో, వారివలె వేదముల జదివినవా రెందరు గలరు? మరియు తపస్సుజేసినవా రెందఱు గలరు? వారు మీవలె ధనార్జనకై ప్రయత్నించునట్లు, మీలోనెవరైన నిరూపింప గలరా? వారు మీవలె మణికుండలములను ధరించెడు వారేనా? వారుమీవలె పండితసాలువలను పీతాంబరములను ధరించెడువారేనా? మీవలె గృహస్థాశ్రమముతో ఋషిధర్మ ముల తప్పి ప్రవర్తించెడువారేనా? వారిలోగల యే యొక యోగ్యతయులేనివారయ్యు వారి గోత్రజుల మగుటచేతనే మేమును ఋషులమనుటకు మీకేమి అధికారమున్న" దని మృదువుగా మందలించెడువారు.

ఇదేవిధముగా, ఎంతసమత్వముతో, ఎంతమృదుమధుర ముగా, ఎంత యుక్తియుక్తముగా, శ్రీ అసంగానందులు వ్యవహరించెడివారో, వారి లోకోద్ధారకమను గ్రంథమును జదివినవా రందఱి కనుభవమే.

అసంగానంద గౌతమబుద్ధులలో మరియొక విశేష మేమనగా, దైవవిషయములో వా రింత సమత్వము నిరూ పించుచుండినను, లోకమర్యాదానుసారము యోగ్యాయోగ్య తల ననుసరించి సమాజములో ప్రవర్తింపవలయునని ప్రబో ధించుటలోనే వారి ప్రజ్ఞావిశేషములు వెల్లడి యగుచున్నవి. ఇంతటి ఉదారాశయములు గలవారగుటచేతనే వారిసంస్థలలో అన్నివర్ణములవారును పనిజేయగలిగిరి. శ్రీ అసంగానందుల వారి సంస్కృత పాఠశాలలోగాని, ముద్రణాశాలలోగాని, ప్రచారకులలోగాని జాతి, మత, కుల, వర్ణ భేదములతో నిమిత్తములేకుండ ఎవ్వ రేపనికర్హులో వారి నాపనికి నియ మించిరి. ఇందు పెక్కుమంది భూసురులు ఆయా యుద్యోగములలో నున్నారు. శ్రీ అసంగానంద గౌతమ బుద్ధులు మానవమాత్రు లెల్లరు ముక్తిపొందుట కర్హులే నని ప్రబోధించిరి. ఆనాటి గౌతమబుద్ధుని తియ్యటి ప్రబోధ ములు స్త్రీలోకములో కూడ వైరాగ్యము కలిగించెను. వైరాగ్యభావముతో పెక్కుమంది నారీమణులు సన్న్యాస

మందుటకువ్విఘ్నారుచుండెడివారు. స్త్రీలకు సన్న్యాసమిచ్చు టకు బుద్ధదేవుడంగీకరింపజాలకపోయెను. తత్కారణమున స్త్రీలోకమున సంచలము బయలుదేరినది. నిర్వాణపథము సర్వుల జన్మహక్కని చాటుచున్న శ్రీ బుద్ధదేవుని కీ పక్ష పాతమేల యను విమర్శనలు నలుమూలలనుండి బయలు దేరినవి. నిజమునకు స్త్రీలు నిర్వాణమార్గమునకు అర్హులు కాదని గౌతమబుద్ధుని అభిప్రాయముకాదు. స్త్రీపురుషులొక సంఘముగ జేరినచో తాను ప్రాణప్రదముగ జూచుకొను పంచశీలముల కేనాటికైన పతనము సంభవించునేమోయని యాతడు సంశయించెను. ఈ తరుణములోనే శ్రీమహా ప్రజావతీ గౌతమీదేవి విరాగిణియై సన్న్యాసమునకై తొందర పడుచున్నదని, ఆనందునిద్వారా గౌతమబుద్ధుడు వినియు అంగీకరింపలేదు. వైరాగ్య త్యాగధనులగు స్త్రీలకీ తిర స్కారము దుఃఖముతోపాటు రోషమునుగూడ గలిగించెను. స్త్రీలకుసన్న్యాసార్హత లేదనుమాట విదుషీమణులంగీకరింప లేకపోయిరి. అర్హతయేలేకున్నచో, ఆదిదేవుడైన పరమేశ్వ రుడు పార్వతి కేలజ్ఞానోపదేశము జేసెను ? నిర్జరారణ్యము లలో పార్వతి తపస్సేల చేసెను ? శ్రీ మహావిష్ణువు భూదేవి కేల తత్త్వోపదేశముజేసెను ? యాజ్ఞవల్క్యాది మహర్షు లేల మైత్రేయీ మొదలగు స్త్రీలకు పరమార్థమును గురించి

బోధించిరి ? భగవంతుడగు బుద్ధునకీ పక్షపాతమేలయను విమర్శనలు చేయదొడగిరి. స్త్రీలోకమెల్ల మహాసంచలన మందుచున్న ఈతరుణములోనే గౌతమీదేవియొక్క దివ్య వాణి ఈ క్రిందివిధముగా దిక్కులెల్లెడ ప్రతిధ్వనించెను.

"ఓవైరాగ్యశీల త్యాగధనులగునా రీమణులారా ! మనలో నిజముగా వైరాగ్యమే మూర్తీభవించినచో మనసన్న్యాస మును కాదనగలవారెవ్వరు ? లోకము క్షణికము, దుఃఖ మని తెలుసుకొనిన కరుణాస్వరూపిణులారా ! లెండు ! ! భోగభాగ్యములను తృణముగ జూడగలిగిన త్యాగధను లారా ! మేల్కొనుడు ! ! భిక్షుణీజీవితమునుగోరిన స్త్రీరత్న ములారా ; బయలుదేరుడు ! ! ! మన త్యాగశీలములను నిరూపింపవలసిన మహాతరుణమిది. నాతోపాటు బుద్ధభగ వానుని సమీపింపదలచిన మహాతల్లులెల్లరు కదలిరం" డను శంఖారావము స్త్రీలోకమును . కదలించివైచినది. ఎండ కన్నెరుగని సుకుమారిణులైన క్షత్రియకన్య లన్నివైపుల నుండి గౌతమీదేవిని కలిసికొనసాగిరి. వైరాగ్యస్వరూపిణు లగు వీరనారీమణులు పెక్కుమంది అనుసరింప, బుద్ధభగ వానుని దర్శింప శ్రీగౌతమీదేవి ప్రయాణము సాగించెను. భిక్షాన్నముతో వందలాదియోజనములు ప్రయాణముజేసి, భగంతుని సన్నిధికి వచ్చిచేరిరి. సన్న్యాస స్వీకారమునకై

అయిదువందలమంది త్యాగమణులతో కలిసి తన సవతితల్లి తన్నుపెంచి పెద్దజేసిన మాతృస్వరూపిణి తన కట్టెదుట సత్యాగ్రహము చేయుట బుద్ధభగవానుని దిగ్భ్రాంతునిజేసెను. తన పట్టుదలను సడలింపజేసికొని కొన్ని ప్రత్యేక నిబంధనలతో స్త్రీలు సన్న్యాసము స్వీకరింపవచ్చునని బుద్ధు డనుజ్ఞ నిచ్చెను.

శ్రీ అనంగానందులుకూడ పంచశీలములను పంచప్రాణములుగ దలంచినవారగుటచే స్త్రీల సన్న్యాసస్వీకారవిషయములో చాలకాలము అంగీకారము చూపలేదు. గీతలో శ్రీకృష్ణపరమాత్మ వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, పాపులుకూడ మోక్షార్హులనియు, (గీత అ 9 శ్లో 23 ) కీర్తి, యశస్సు, వినయవాక్కు, మేధస్సు, ధైర్యము, క్షమయను సప్త సుగుణములతో నేనే స్త్రీలలో ప్రకాశింపుచున్నా (కీర్తి శ్శ్రీర్వాక్చనారీణాం)ననియు చెప్పుటచేతను, అనేకమందిస్త్రీలు సన్న్యాసము తీసికొన్నట్లు శాస్త్రములలో కనుపించుటచేతను, కొన్నాళ్ళకు శ్రీవారే వైరాగ్యముగల స్త్రీలు సన్న్యాసము తీసికొనుటలో తప్పులేదను సిద్ధాంతములోనికి వచ్చిరి. ఈ విషయమునుగురించి ప్రప్రథమమున శ్రీ సాధుమాత గారితో మాట్లాడినప్పు డీక్రిందివిధముగా శ్రీ అసంగానందులు చెప్పిరి.

నిజమైన త్యాగవైరాగ్యములు గలస్త్రీలు సన్న్యాసము తీసికొనుట శాస్త్రవిరుద్ధముకాదు. కాషాయము స్వేచ్ఛకు చిహ్నమనిచాలమంది తలంతురు. కాషాయము నియమబద్ధ జీవితమును ఆదర్శప్రాయముగ గడుపదలంచినవారికొరకే యేర్పడినది. కాషాయవస్త్రధారులైనను స్త్రీపురుష లొకే మఠములో నివసింపరాదు. భిక్షకు తప్ప యితరసమయము లలో గృహస్థులయిండ్లకు వెళ్ళరాదని హితోపదేశముజేసిరి. స్త్రీలు సన్న్యాసమునకు అధికారము గలవారేనని నిరూపిం చుచు "సన్న్యాసధర్మ" మనునొక గ్రంథముకూడ రచియించిరి.....

గౌతమబుద్ధునితర్వాతవచ్చిన ప్రవక్తలలో శ్రీ అసం గానందులవలె స్త్రీల సన్న్యాసమును అంగీకరించిన ప్రవక్త కానరాడు. వీరెంతటి సర్వమానవసమత్వము గలవారో, అంతటి అపరిగ్రహవ్రతశీలురు. వీరి అపరిగ్రహ వ్రత పాలనమునుగురించి యెంతజెప్పినను తక్కువయే యగును. మాసపత్రికను, సంస్కృత పాఠశాలను, బీదవిద్యార్థులను, ఆధ్యాత్మిక విషయసాధకులను 26 సంవత్సరములనుండి పోషించు భారమును తమ భుజస్కంధముల నిడుకొనిరి గదా! మేమింతటిసంస్థను నడుపుచున్నాము, కాబట్టి మీశక్తి కొలది సహాయపడవలసినదిగా విజ్ఞప్తి, ప్రకటన లేక

ఉపన్యాసము చేయరనే, అయాచితముగ భక్తులు సమర్పించు నట్టియు, శ్రీవారి గ్రంథప్రచురణవలన లభ్యమగునట్టియు ధనముతో, వివిధ శాఖోపశాఖలతోగూడిన మహాసంస్థను నడిపించుటలో చలింపలేదు.

నాటిసమాజపరిస్థితులను దృష్టిలోపెట్టికొని తగినచికిత్స చేయగలిగిన మహాపురుషులలో శ్రీ అసంగానంద గౌతమ బుద్ధులు సాటిలేని మేటిప్రవక్తలని వారొనరించిన ప్రతి కార్యము ధ్రువపరుచుచున్నది. శాస్త్రముల నిజతత్త్వము నకు భిన్నములేకుండ, సమాజము నేపద్ధతులపై నడపినచో గమ్యస్థానము సులభముగ జేరగలదనియే వారి ప్రధాన లక్ష్యము. స్వతంత్రులయ్యు సనాతనధర్మవిరుద్ధముగ నొక్క నిబంధనకూడ వీరుచేయలేదు. చరిత్రను పరిశీలించినవారికి శ్రీ అనంగానంద గౌతమబుద్ధుల ఆధ్యాత్మిక ప్రబోధము లోకేదృక్పథముతోనున్నవని స్పష్టపడగలదు. వీరి ఆధ్యా త్మికసిద్ధాంతములను తెలిసికొనదలచినవారు వారివారి కాల పరిస్థితులనుగురించి ముంచు తెలిసికొనవలసియున్నది.

బుద్ధునికాలములో మానవుల సుఖదుఃఖముల కాధార భూతులు స్వర్గాదిదేవతలనియు, వారి సంతోషముకొరకై హింసారూపములైన యజ్ఞయాగాదులు మానవులు చేయ

వలసియున్నదనియు, దేవతలను తృప్తిపరచకున్నచో కష్టముల పాలగుదుమనియు మానవులలో మూఢవిశ్వాసము ప్రబలముగ నుండెను, ఆసమయములో భారతీయులలో సంఘైక్యత, సత్యాహింస బ్రహ్మచర్యల ప్రాముఖ్యత పురుషప్రయత్నముయొక్క అవసరములనుగురించి ప్రబోధింపవలసియుండెను.

అందుకొఱకై దీక్షాకంకణుడైన గౌతమబుద్ధుడు. జీవేశ్వరులు, జననమరణము లను నిగూఢప్రశ్నలను పూర్తిగవదలివైచినాడు. దీనికి కారణమేమనగా నాటిపరిస్థితులనుబట్టి దేవుడుకలడన్నచో దేవుని ఆశీర్వాదముకొరకై యజ్ఞయాగాదులు జేయుటలో తప్పేమున్నదని ప్రశ్నించుటకు పండితులు వేచియుండిరి. దేవుడు లేడనుట సంఘశ్రేయస్సునకు భంగముమాత్రమేగాక నాస్తికుడను కారణమున సమాజము ఆయన బోధలను తిరస్కరించుననుటలో అనుమానముండదు. ఈకారణములచేతనే జీవేశ్వరులను గురించియు, జనన మరణములను గురించియు, వివిధదేవతలను గురించియు, ప్రోష్ఠపాదు డడిగిన ప్రశ్నలను శ్రీ గౌతమ బుద్ధుడు, విచారణచేయుటకు యోగ్యముకాని ప్రశ్న లని యొక్కపెట్టున నిరాకరించినాడు.

దీనినాధారముజేసికొనియే తర్వాత వచ్చిన ప్రవక్తలలో చాలమంది బుద్ధుడు నాస్తికుడని చెప్పసాహసించిరి. నిష్పక్ష పాతముగ చరిత్రను పరిశీలించినచో బుద్ధుడు ఆస్తికు డే విధముగ ప్రవర్తింపనగునో యట్లే క్రమము తప్పక ప్రవర్తించెనని స్పష్టపడును. గౌతమబుద్ధుడు జననమరణము లను నమ్మనివాడైనచో తన పూర్వజన్మలను 550 వర కెరిగిన ట్లెట్లుచెప్పగలడు? జన్మల నంగీకరించినప్పుడు దానికి కారణమైన కర్మసూత్రము అంగీకరించినట్లేగదా! బుద్ధుడు కర్మసూత్రమునంగీకరింపనివాడైనచో, మహారాజ పదవిని సరకుగొనక మహారణ్యమధ్యమున నిరాహారిగా తపింపవలసినపని యేమివచ్చినది? శ్రుతిప్రతిపాదితమగు ఆనందఘనమునే తాననుభవింపక పోయినచో, ప్రపంచ భోగములు తుచ్ఛములని దేని నాధారముజేసికొని ప్రబో ధించెను? స్వర్గాదిభోగములను తుచ్ఛాతితుచ్ఛముగ జేయ గలిగిన ఆనందఘనమునే తా ననుభవింపకున్నచో రారాజు లేమిచూచుకొని తమభోగభాగ్యములను విసర్జింప గలిగిరి? గౌతమబుద్ధుడు నాస్తికత్వమునే నమ్మినవాడైనచో తాను తపస్సుద్వారా పొందిన అనుభవమునకు నిర్వాణమని యేల నామకరణముచేయును? నిర్వాణమునకు శూన్యమనియే

యర్థముగాక్కూడదా యనినచో, [1]అమరకోశము [2]విశ్వప్రకాశము [3]హలాయుధము [4]శాశ్వతకోశము [5]అనేకార్థ సంగ్రహము [6]వైజయంతి [7]మేదినీ [8]హైమాది నిఘంటవులెల్ల నిర్వాణమును మోక్షమునకు పర్యాయపదమని యేల యేకగ్రీవముగ జెప్పినవి ! నిర్వాణమను పదము శూన్యమునకు పర్యాయ పదమైనచో శ్రీమద్భగవద్గీత మోక్షపదమునకు పర్యాయముగా నిర్వాణమని యేల అయిదుసార్లు పేర్కొ-

---

1. శ్లో॥ "ముక్తిః కైవల్యనిర్వాణః
శ్రేయోనిశ్శ్రేయసామృతం మోక్షో ఉపవర్గ॥ఫీవర్గము."

2. "నిర్వాణమస్తంగమనే నిర్వృతౌగజమజ్జనే అపవర్గేచ"

3. "కైవల్యంనిర్వాణంనిశ్శ్రేయస
మమృతమక్షరంబ్రహ్మఅపునర్భవో ఒపవర్గో
ముక్తిర్మోక్షోమహానందః.
సనాతనంధ్రువంనిత్యం శాశ్వతం స్యాదనశ్వరమ్"

4. "నిర్వాణమస్తంగమనం నిర్వాణంగజమజ్జనం
నిర్వాణమపవర్గో ఒపి నిర్వాణంనిర్వృతింవిదుః"

5. "నిర్వాణమోక్షనిర్వృత్యో ర్విఘాతేకరిమజ్జనే"

6. "నిర్వాణం నిర్వృతౌమోక్షే వినాశేగజమజ్జనే"

7. "నిర్వాణమస్తంగమనే
నిర్వృతౌగజమజ్జనే సంగమేప్యపవర్గేచ"

8. "నిర్వాణంమోక్షనిర్వృత్యోః విధానేకరిమజ్జనే"

నును ?[1] నిర్వాణమను పదము శూన్యమునకే అర్థమైనచో మహాభాష్యకారులైన [2]ఆదిశంకరులు [3]మధుసూదన సరస్వతీ స్వాములు [4]శ్రీధరస్వాములు మొదలగువా రేల నిర్వాణ మను శబ్దమును మోక్ష మను పదమునకు పర్యాయపదమని అంగీకరించిరి ? నిర్వాణమనుపదము శూన్యమునే తెలియ జేసినచో వసిష్ఠభగవానుడు యోగవాసిష్ఠములో నిర్వాణమను పదమును వందలాది పర్యాయము లుపయోగించినదేగాక, నిర్వాణమను నొక ప్రకరణమునే ప్రత్యేక మెంచు కేర్పరచును! శ్రీ. శంకరులు నిర్వాణషట్కము నేల లిఖించిరి? అంతదూరమేల ! బుద్ధుని శిష్యులు బుద్ధునిద్వారాశూన్యమునే పొందిరో, ఆనందఘనమునే అనుభవించిరో తెలిసికొన వలసినచో ఈ క్రింది విషయములను పరికింపుడు.

ఒకనాడు గౌతమబుద్ధుడు భద్రికు డను భిక్షువుతో, నీవు అరణ్యమందు విమనస్కుడవై వెనుకటి రాజ్యసుఖములను

---

1. "శ్రీ భగవద్గీత అ 2 శ్లో 72 లోను, అ 5 శ్లో 24 లోను, అ 5 శ్లో25 లోను, అ 5 శ్లో26 లోను, అ 6 శ్లో 15 లోను చూడనగును"
2. నిర్వాణపరమాం నిర్వాణం మోక్షః తత్పరమం నిష్ఠా, యస్యాః శాంతేః సా నిర్వాణపరమా"
3. "బ్రహ్మనిర్వాణం బ్రహ్మణినిర్వాణం నిర్వృతిం బ్రహ్మరూపం నిర్వాణ మితివా"
4. "బ్రహ్మణి నిర్వాణం లయం."

దలంచికాబోలు "ఆహా, సుఖము, ఆహా, సుఖమని" కేకలు వేయుచు తిరుగుచున్నావని తెలిసినది. నీ వట్లరచు టకు కారణమేమని ప్రశ్నింపగా భద్రికుడిట్లనియెను. "ఓబుద్ధ భగవానుడా ! నేను రాజునైయున్నప్పుడు, పురమునందలి అంతఃపురమున నివసించియు, నిరంతరము రక్షకజనపరి వేష్టితుడ నయ్యును, సకలభోగ భాగ్యములు గలిగి యుండియు, ఈనాటి నిర్భయత్వము, సంశయరాహిత్యము, పరమశాంతి, పరమానందము నా కేనాడును లభింపని కారణ మున "ఆహా సుఖము ఆహా సుఖమని" వెఱ్ఱివానివలె కేకలుపెట్టితినని సమాధానము చెప్పెను. (బుద్ధచర్య)

ఆ యానందఘనమైన పరమనిర్వాణమును, తాననుభ వించి శిష్యుల ననుభవింపజేసె ననుట కింతకంటె పరమ ప్రమాణమేమికావలయును ? ఇంకకొంచెములోతుగ విచా రించినచో, దేవతలులేరని బుద్ధభగవానుడు చెప్పలేదనియు, పరమనిర్వాణమును బొందనర్హతగల మానవ జన్మలు నియమబద్ధముగ నడువగలిగినచో, మానవులకు దేవతలు సేవకులుగ నుందురనిమాత్రమే జెప్పెననియు స్పష్టపడు చున్నది. ఉదాహరణకీక్రింది పంక్తులను చదువుడు.

గౌతమబుద్ధుని ప్రధానశిష్యుడు, సారిపుత్రుని మహా ప్రస్థానసమయమున దేవతలు సేవజేయుటకు వచ్చుటచూచి,

"నాయనా నీవు దేవతలకంటె గొప్పవాడవా" యని తల్లి అడిగినప్పుడు, "ఉపాసికా! వారు మా పరిచారికులని సారి పుత్రుడు చెప్పుటయే దీనికి పరమప్రమాణము.

ఆ కారణముచేతనే బుద్ధభగవానుడు దేవతలను తృప్తి పరచుటకై యజ్ఞయాగాదులు చేయనక్కర లేదనియు, వారిని సేవకులనుగా చేసికొనుటకు తగిన సత్యాహింసాది గుణముల నలవరచుకొనుడనియు ప్రబోధించినట్లు స్పష్ట పడుచుండగా, బుద్ధభగవానుని నాస్తికుడని చెప్పుట యెంతటి ద్రోహమో పరిశీలింపుడు. ఈ చర్చనింతటితో విరమించి శ్రీఅసంగానందుల ఆధ్యాత్మికసిద్ధాంత మెట్లుం డునో చూతము.

గౌతమబుద్ధుడు అవతారము చాలించిన ఎంతకాలము నకో అసంగానందు లవతరించిరిగదా! ఈ లోపల ఎందఱు ప్రవక్తలు అవతరించిరో, సంఘమున నెన్నిమార్పులు వచ్చినవో గమనింపుడు. క్రీస్తుప్రవక్త అవతరించుట ఒక క్రొత్తవెలుగు ప్రసాదించుట. మహమ్మదు ప్రవక్త అవతరించుట సమాజమునకొక క్రొత్తపోకడ తెచ్చుట. సనాతన మతగ్రంథములకు అద్వైతపరముగ శంకరుడు, విశిష్టాద్వైతపరముగ రామానుజుడు, ద్వైతపరముగ మధ్వాచార్యులు వ్యాఖ్యానించుట. గురునానక్ సిక్కుమత

మును స్థాపించి ఐక్యత నుద్బోధించుట. దయానంద స్సరస్వతి ఆర్యసమాజమనుపేర నొకసంఘమును నెలకొల్పి ధర్మప్రచారముచేయుట. రాజా రామమోహనులు బ్రహ్మ సమాజమును స్థాపించి ప్రబోధము చేయుట గమనింపుడు. ఇందరు ప్రవక్తలు, ఆచార్యపురుషులు అవతరించి ప్రబో ధము చేసినపిదప సంఘములో ఆ యా ప్రవక్తల యొక్కయు, ఆచార్యులయొక్కయు ప్రభావము వలన మంచిఫలితములే గలిగియుండునుగాని, వారిసిద్ధాంతములను ప్రజలుసరిగాఅర్థముజేసికొన్నట్లు కనిపించదు, మానవులెల్లరు ఒక్కటియేయను ప్రవక్తల యాశయమును గమనింపక తాము నమ్మినప్రవక్తను లేక ఆచార్యపురుషుని ఆరాధించుట, మిగిలినవారిని న్యూనముగ భావించుట తటస్థించెను. తాను నమ్మిన ప్రవక్తప్రవచనములే పరమప్రమాణములనియు, మిగిలిన ప్రవక్తలప్రబోధము లప్రమాణములనియు, ప్రచా రము చేయుట సర్వసామాన్యమైనది. స్వార్థము పెచ్చుపెరిగి నది. సమాజసౌఖ్యములోనే తనసౌఖ్యమిమిడియున్నదని మానవుడు గుర్తింపలేకున్నాడు. జీవరాసులలోని "సత్" అనునది గుర్తింపగలిగిన, అందరు ఒక్కటియే కాబట్టి సర్వమానవుల శ్రేయస్సు గమనింపవలెనని గుర్తింప గలు గును. అట్లు గుర్తింపగలిగిననాడు నేడవసరమైన రేషన్

విజయవంతమగును. చీకటిబజారు లుండనేరవు. యుద్ధ ఘోషలు వినబడవు. జాత్యహంకారములు నిలువనేరవు. అప్పుడే కులభేదములలోని న్యూనాధిక్యతలు సమసిపోవును. లోకమునకు శాంతియేర్పడును. ఆ సద్వస్తువును గుర్తింపజేసి సర్వమానవ సౌభ్రాతృత్వమును స్థాపించవలసిన కాలమిది. ఈ మహత్కార్యమును సాధించుటకై దీక్షాకంకణులైన శ్రీ అసంగానందులు, ప్రపంచ మతములనెల్ల పరిశోధించి మూడు వర్గములుగ విభజించిరి.........

సర్వము మిథ్యయనియు "నే" నను సద్వస్తువొక్కటియే సత్యమనియు దీనిని తెలిసికొన్నవాడు చేయవలసినదియు, చేయదగనిదియు లేదను తత్త్వవేత్తల నొకవర్గముగను, సర్వనియామక కర్త ఒకడుకలడనియు, మనమతని దాసుల మనియు, నమ్మి కేవల భక్తిమార్గపరుల నొకవర్గముగను - కొన్ని రాసాయనిక అణువులకలయికయే జగత్తనియు, మన ప్రయత్నములపై మనసుఖదుఃఖము లాధారపడియుండునని నిర్ణయించినభౌతికవాదులనొకవర్గముగను విభజించి,వీటిలోని సర్వమానవులకు ఆచరణయోగ్యములైన సత్యసిద్ధాంతము లను తీసికొని వాటిలోని అంధవిశ్వాసములను దూరముచేసి ముక్తిసాధమునకు నూతనసోపానములను నిర్మించెను. ఆసోపానము నధిరోహింపగలిగిన వారెల్లరు పరమనిర్వాణ మును ఆనందఘనమును పొందవచ్చునని ప్రబోధించెను.

అసంగానందులు ముక్తిసౌధమున కమర్చిన సోపానముల వివరములను గురించి ఈ క్రిందచూడుడు—

తత్త్వజ్ఞులచే చెప్పబడు సర్వము సద్వస్తువను పరమ సూక్తిని మొదటిసోపానముగ నమర్చి వారిచే చెప్పబడు చేయవలసినదియు చేయకూడనిదియు లేదను వాదమును త్యజించెను. ఎల్లరకీశ్వరుదే రక్షకుడను వాదములోని అనన్య భక్తిని రెండవసోపానముగ నమర్చి, వివిధభక్తి మార్గీయులచే చెప్పబడుచున్న దేవుని భిన్నభిన్న రూప, నామ, లోకములను దూరముననుంచెను. అట్లే భౌతికవాదుల వాదములోని మానవకళ్యాణమునకై నిరంతరము పురుష కార మొనర్పవలయుననునది మూడవ సోపానముగ నమర్చి భోగముల ననుభవించుటకే కర్మలాచరింపవలయునను వాద మును పరిత్యజించెను. పైనజెప్పబడిన త్రివిధసోపానముల ద్వారా ముక్తిసౌధమును అధిరోహింపదలచిన వారికి చేపట్టు లుగా సత్యాహింస శాంతిశమదమాదుల నమర్చి పరంపరగా అనుసరింపుచు వచ్చుచున్న కట్టు, బొట్టు, జుట్టు అను అంధానుకరణమును దూరముగ నుంచెను.

పై సోపానముననుసరించి ముక్తిసౌధము నధిరోహింప దలచినవారు ఓం, తత్, సత్ అను పరమ నిర్వాణమును పొందగలరని సిద్ధాంతము జేసెను.

శ్రుతుల ననుసరింపుచునే పూర్వప్రవక్తల మార్గముల నంగీకరింపుచునే పరమ నిర్వాణమును సమర్థించుటలో వారెంతటి ప్రజ్ఞను ప్రదర్శించిరో ఎంతటిఅతీంద్రియజ్ఞానులో స్పష్టపడుచున్నది. వా రింతటి విశాలమార్గములను చూపుట చేతనే, వివిధదైవోపాసకులు, దైవారాధకులు, యోగసాధకులు, సర్వవర్ణములవారుకూడ, వారిసంస్థలో కలిసి, శాంతముగా ప్రయాణముచేయ గలుగుచున్నారు.

ప్రపంచ మతసిద్ధాన్తములసారమగు, నిష్కామకర్మ, అనన్యభక్తి, తత్త్వాన్వేషణలను, సోపానములనుగాజేసి పొందవలసిన పరాకాష్ఠకు "ఓం, తత్, సత్" అని నామకరణము జేసినారు. ఈ నామము బుద్ధభగవానునిచే చెప్పబడిన నిర్వాణమను పదమునకు భిన్నముకాదని సమస్త శాస్త్రములలోని ప్రమాణములను జూపుచు, నిర్వాణనిలయమను గ్రంథమును వారుప్రకటించుటలోనే ఈ సత్యము స్పష్టపడుచున్నది.

మానవుని సంపూర్ణాత్మశాంతికి సంఘైక్యము - సంఘైకమత్యమునకు, ధర్మపాలన, అత్యవసరమని గుర్తించిన సర్వసంగపరిత్యాగులలో మొదటివారు శ్రీగౌతమబుద్ధులని చరిత్రను చదివినవారికెల్ల తెలియును, "బుద్ధం శరణం గచ్ఛామి" అను. ప్రధాన సిద్ధాన్తమునకు "ధర్మం శరణం

గచ్ఛామి'' "సంఘం శరణం గచ్ఛామి''అనుసిద్ధాన్తములను, జోడించుటలోనే, వారిలక్ష్యమేమియో స్పష్టపడుచున్నది.

శ్రీ అసంగానందులుగూడ స్వరాజ్యము, ఆత్మరాజ్యమున కవసరమనియు, ఆత్మరాజ్యము స్వరాజ్యమునకు వెలుగునిచ్చుననియు, స్వరాజ్యఆత్మరాజ్యములు, సంపాదించుటతో, పడినశ్రమకంటె వాటిని భద్రపరచుకొనుటలో నెక్కువ శ్రమపడవలసియున్నదనియు ప్రధానముగా ప్రబోధించెడువారని వారిసమావేశములలో పాల్గొన్నవారికి తెలియనిదికాదు. రాజకీయోద్యమములో, శ్రీ అసంగానందు లెట్టి యభిప్రాయములు గలవారో, మొవ్వ (కృష్ణాజిల్లా) లో జరుగు, సనాతనవేదాంతసభకు శ్రీవారిని వెళ్ళకుండ, నిషేధించినట్టియు వ్యాసాశ్రమమును రెండుసార్లు పరిశోధించినట్టియు అప్పటి ప్రభుత్వమునకు తెలిసినంతగా ఆంధ్ర ప్రజానీకమునకు తెలియకపోవచ్చును.

ప్రకటనలు, ఆడంబరములు, లేని శ్రీవారి కార్యక్రమములో ఎవరికెంతవరకు తెలియవలసియుండునో, అంత మాత్రమే తెలియవచ్చును. కాబట్టి వారి కార్యములన్నియు, అందరకు తెలియవు. శ్రీ అసంగానందుని ముఖ్య శిష్యులలో శ్రీ తత్త్వానంద, సాయంవరదదాసు, మున్నగువారు ప్రచురించిన స్వరాజ్యఢంకా మొదలగుపాటలు,

కృష్ణా గుంటూరు, జిల్లాలలో, ఎంతటి ఉత్సాహమును రేకెత్తించినవో, అప్పటినాయకుల కందఱికి తెలిసియే యున్నది. శ్రీ అసంగానందులకు సంబంధించిన సంస్థల లోని, స్త్రీపురుషాదులు పెక్కుమంది కారాగారములకు వెళ్ళుట శ్రీవారి ఆశీర్వాదములతోనేయని వేరుగాచెప్ప నక్కఱలేదు. ఆంధ్రదేశములో ఆనాటికే ప్రజానీకములో మిక్కిలి పలుకుబడిగలిగిన శ్రీ అసంగాదులు మహాత్మా గాంధీగారు, శ్రీ పట్టాభిసీతారామయ్యగారింట సమావేశ మగుటకు కారణమేమో తెలిసినవారికి మాత్రమే స్వాతం త్ర్యముకొఱకై, శ్రీ అసంగానందు లెంతగా కృషిచేసిరో స్పష్టముగాగలదు. ఈవిధముగా శ్రీ అసంగానందులు నిర్వహించు కార్యము లెన్నియోగలవు. వారు శోధింపని మతశాఖలు లేవు. వారవలంబింపని యోగసాధనలు లేవు. వారికి తెలిసిన ధర్మకార్యములలో చేయూతనొసగని దొకటిలేదు. వారిదృష్టిలో పడని ధర్మమార్గములులేవు,

శ్రీ గౌతమబుద్ధునిసంస్థలవలెనే, వీరిసంస్థలో, స్త్రీపురుష తిలోగూడ, అవధూతలున్నారు. ఏకాన్తవాసులున్నారు. జపముచేయువారున్నారు. ధ్యానపరులున్నారు. జితేన్ద్రియు లున్నారు. కాషాయ ధారులున్నారు. ఉత్తమ ప్రబోధకు లున్నారు. నిష్కామపరులున్నారు. భక్తిపరులున్నారు..

మహాపండితులున్నారు. కవులున్నారు. గాయకులున్నారు. బ్రహ్మచారులున్నారు. గృహస్థు లున్నారు. వానప్రస్థు లున్నారు. మూర్తిపూజకులున్నారు. ఇస్లాంభక్తులున్నారు. కార్మిక, కర్షకులున్నారు. ప్రభుత్వోద్యోగు లున్నారు. వణిజులున్నారు. అగ్రవర్ణమునుండి అన్త్యవర్ణముల వరకునున్నారు. పూర్ణపురుషులగు శ్రీఅసంగానందులకు తప్ప భిన్నభిన్నప్రకృతులుగల ఇన్నితరగతులవారి హాత్మశాంతికి సంబంధించిన, మార్గములను ప్రబోధించుట, ఎవరికి సాధ్య మగును? సహస్రముఖముల విజ్ఞాన కిరణములతో ప్రకాశించు శ్రీ అసంగానందులను గురించి రచింపబూనుట అల్పజ్ఞుడనగు నాశక్తికి మించినపని. వారిమహాశక్తిని గ్రహింపగలిగితిని. చిత్రించుటకు నాకుగల భాషాకోశము చిన్నదైనకారణమున సర్వాంగసౌష్ఠవముగా, సుందరముగా శ్రీవారి చిత్తరువును మీముందు పెట్టనేరకపోతిని. దక్షులగు వారెవరైనను అట్టిచిత్తరువును లిఖించినప్పుడు నా ఆనంద మునకు మితియుండదు. త్వరలో అట్టిది లభ్యమగు గాక!

ఎవ్వని ఆశీర్వాదబలముతో, నేనీగ్రంథమును ప్రకటింప శక్తివంతుడనైతినో అట్టి శ్రీ సద్గురు నొక్కసారి స్మరించి నే నీ గ్రంథమును సమాప్తి జేయుచున్నాను........

సీ. పదియు నారేడుల ప్రాయంబుననె
పూర్ణవైరాగ్యమూర్తియై బరగె నెవడు,
ఆసేతుపర్యంత మఖిల తీర్థంబుల
పాదసంచారియై బరగె నెవడు,
గోగర్భమాదియౌ గుహలలో తపసియై
స్వస్వరూపముగన్న స్వామియెవడు,
కలమతంబుల నిజగమ్య మొక్కటియని
సిద్ధాంత బరచిన సిద్ధుడెవడు,
అట్టి పరిపూర్ణసద్గురు ననుదినంబు
ప్రార్థనముజేయ పాపముల్ బాసిచనవె
సకలమతవర్తి యతిలోక చక్రవర్తి
బుద్ధసమమూర్తి మలయాళ సిద్ధమూర్తి.

ఓం. తత్. సత్.

శాంతిః శాంతిః శాంతిః.

# శ్రీ సద్గురు అసంగానందులవారి సదుపదేశములు

1. ఒక్కొక్కరున్ను వారివారి జీవితమునకు పాపములేని పనిని కాలనియమమ్ముతప్పక శ్రద్ధతో చేయుట ధర్మము. ఈ విషయములో విజయము నొందినచో వారు అన్నిటి లోను విజయులే..........

2. అధర్మమార్గముచే పంచభక్ష్య పరమాన్నాది వస్తువులను భుజించి జీవించుటకన్న ధర్మమార్గములోనుండి, అంబలి కూటి నీరుతో జీవించుట శ్రేష్ఠతమము. అధర్మముతో యేర్పడిన సుఖభోగములు విషముకలిసిన క్షీరాన్నము వంటివి.

3. సాక్షా దపరోక్షజ్ఞానము కలిగినను, యుక్తాహారము వివిక్తవాసము బ్రహ్మచింతనము అను నీ నియమ త్రయములను శరీరపతన పర్యంతము విడువరాదు.

4. ఉత్కృష్టగుణములులేకనే ఉత్తమకులములో జన్మించిన కారణముగా ఎవ్వరు శ్రేష్ఠుల మని తలతురో అట్లే ఎవ్వరు ఉత్కృష్టస్థితిని పొందుటకు అర్హతలేని తక్కువ కులమువారమని తలంతురో అట్టివారికులము ఆరాజ్యము కూడ అధఃపతన మొందుట కెట్టిసందేహము లేదు.

5. సత్యము, ధర్మము, ఆత్మపారిశుద్ధ్యము అనువీని ననుష్ఠించుటకును, వీనిని లోకములో నిరాటంకముగ ఉపదేశించుటకును మాత్రమే సన్న్యాసమేర్పడినదని యెవ్వరున్ను మరువకూడదు.

6. అశాశ్వతమగు దేహపోషణకొరకు సమయము లేర్పరచినట్లు, దైవప్రార్థన, ధ్యాన, జపాదులకు కూడ సమయ మేర్పరచుకొనుటయే, మానవజన్మయొక్క ముఖ్య ధర్మము.

7. ఒక్క ప్రాణికైన క్లేశముకలుగకుండునట్లు నడచుకొనుటయే మానవుని పరమధర్మము. తానొకనికి క్లేశము కలిగించిన మరొకవిధమున తానాక్లేశమును విధిగా అనుభవించియే తీరును.

8. నీప్రవర్తనలో యిసుకరేణువంత పాపమున కీదినమున అవకాశమిచ్చివచో, రేపటికి మహామేరువంత యగునని మరువబోకుము.

9. ఇంద్రియ సుఖమున కెంతెంత దగ్గరకు చేరుదురో దైవానందమున కంతంత దూరమగుదురు.

ఓం, తత్, సత్.

పంచాయతీ
వేమన గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

# శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి
# గ్రంథములు

1. శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము 3—0—0
2. శ్రీ భగవద్గీత మూలము, పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థ సహితము 6—0—0
3. లోకోద్ధారకము 4—0—0
4. పాతంజలయోగసూత్రము 5—0—0

మరియు వారు రచించిన 35 గ్రంథములుగాక యితరముగా

శ్రీ బుద్ధచర్య 5—0—0

అసంగానంద గౌతమబుద్ధులు 0—8—0

యోగవాసిష్ఠము: 32 వేల శ్లోకములు తాత్పర్యముతోసహా పూర్వార్థము రెండు సంపుటములు 20—0—0

యోగవాసిష్ఠము: ఉత్తరార్థము రెండుసంపుటములు 25—0—0

మరియు ఇట్టివి 50 గ్రంథములను చూడదలచినవారు మా "పుస్తకముల పట్టీ" కి వ్రాయవలయును.

వలయువారు: వ్యాసాశ్రమము, యేర్పేడు P. O.
(చిత్తూరుజిల్లా)
అని వ్రాయవలయును.



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RLA 101 B158 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yc |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BA |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | Nava THASIN |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |